# విజయ

తెలుగు మాస పత్రికకు

అన్ని గ్రామాలలోనూ, పట్టణాలలోనూ

సమర్థవంతులైన ఏజంట్లు కావాలి !

ఏజన్సీ వివరాలకు
వెంటనే రాయండి.

సర్క్యులేషన్ మానేజర్
విజయ
9, దేశికా రోడ్డు,
మైలాపూరు,
మద్రాసు–600 004




సంపాదక వర్గం

సంపాదకుడు :
లయన్ కె.వి. గోవిందరావు, బి.ఏ.,ఎల్ ఎల్.బి.
గౌరవ సహాయ సంపాదకులు :
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, ఎమ్.ఏ., విద్వాన్
వి. బాలకుమార్, ఎమ్.ఏ.,బి ఎల్
సభ్యులు :
కె.వి.ఎస్. గోవిందరావు, బి.ఏ.,ఎల్ ఎల్ బి
కె.వి.ఎస్. శరత్‌బాబు, బి ఏ.,బి కామ్.,బి ఎల్
కె.వి.ఎస్. విజయకుమార్
కె. రత్నకుమారి


చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 45.00 |


చందాలు పంపవలసిన చిరునామా :

విస్‌డమ్

9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు-600 004


# ఈ సంచికలో

జూలై 1984





ముఖచిత్రం-కలర్ ట్రాన్స్‌పరెన్సీ:
శ్రీ కె. ఆర్. రవీంద్రనాథ్, మద్రాసు.

**తెలుగు 'విస్‌డమ్'కు ఇది మూడవ సంవత్సరం**

## ధ్యానం

# ఎవరి కర్మకు వారే కర్తలు



జేమ్స్ ఎలెన్

ఎవరు చేసే ఆలోచనలకు, ఎవరు బ్రతికే బ్రతుకుకు వారే కర్తలు! ఏ సంఘటనా, ఏ పరిస్థితీ 'చెడు' చేసేట్టు ఎవ్వరినీ బలాత్కరించ లేవు. మనిషి తనను తనే బలాత్కరించుకుంటాడు. అన్ని పనులూ బుద్ధిపూర్వకంగానే చేస్తాడు. ఎంత వివేకశాలి అయినా - చివరికి దేవుడు దిగి వచ్చినా - 'మంచి' చేసేట్టు ఎవ్వరినీ ప్రేరేపించలేడు. ఎవరికి వారే తమ 'మంచి'తామేఎంచుకోవాలి;తమ ఆనందం తామే పండించుకోవాలి!

ఉన్న స్థితితో తృప్తి పడేవారికి ఈ విజయం అందని మ్రాని పండు. దాని కోసం తహ తహ లాడేవారే, తపస్సు చేసేవారే దానిని అందుకుంటారు!

## సంపాదకుని పేజీ

# మన్నన మహిమ

సుప్రసిద్ధ రష్యన్ నవలా రచయిత లియో టాల్‌స్టాయ్ వీధిలో పోతూ ఉండగా ఒక రోజున అతి దీనంగా కనిపించే బిచ్చగాడొకడు ఆయన ముందు చేయి జాపాడు. జేబులు తడిమి చూసుకుని "జేబులో డబ్బులు లేవు తమ్ముడూ! ఉంటే తప్పకుండా ఇచ్చేవాణ్ణి!" అన్నాడు టాల్‌స్టాయ్.

ఆయన మన్ననకు పొంగిపోయిన బిచ్చగాడు "పోన్లెండి బాబూ! నన్ను 'తమ్ముడూ!' అని మన్నించారు. అదే పదివేలు!" అన్నాడు.

మన్నన వల్ల కొన్ని జీవితాలు కొత్త మలుపులు తిరిగాయి. కొన్ని సంఘాలలో అద్భుతమైన పరిణామాలు వచ్చాయి. విషాదాంతాలు సుఖాంతాలు అయాయి. 'మన్నన' మహిమ గుర్తించి అందరినీ మన్నించడం అలవరచుకోండి!

మనశ్శాస్త్రవేత్త డా॥ జార్జ్ క్రేన్ రోగుల కిచ్చే సలహాల రంగంలోకి కూడా 'మన్నన'ను ప్రవేశపెట్టాడు. ఒక లేడీ సెక్రటరీ ఒకసారి ఆయన దగ్గిరికి వచ్చి "మా 'బాస్' అంటే నా కిష్టం లేదు" అంది. "రేపటి

## కెప్టెన్ అయిన గోల్ కీపర్

1966 ఆసియా క్రీడలలో ఇండియన్ హాకీ జట్టుకు శంకర్ లక్ష్మణ్ అనే గోల్ కీపర్ కెప్టెన్‌గా వ్యవహరించాడు.

"ఏ ఒక్కరూ ఫలానా మతంలో జన్మించరు. జన్మించిన తరువాత ఫలానా మతానికి చెందినవా రవుతారు!"

నుంచి మీ 'బాస్'ని మన్నించడం మొదలు పెట్టు. రోజూ ఆయన దుస్తులు పొగడు! ఆయన 'టై' అంటే నీ కెంత ఇష్టమో చెప్పు! ఆయన హాబీలలో ఆసక్తి చూపించు!" అని ఆమెకు ఆయన సలహా ఇచ్చాడు.



ఆరు నెలల తరువాత ఆమె వచ్చి "నేను ఆ ఉద్యోగం మానేస్తున్నాను డాక్టర్‌గారూ!" అంది. "ఎందుకని?" అని అడిగాడు డాక్టర్. "ఒకప్పుడు నా కిష్టం లేదని చెప్పానే—ఆ 'బాస్'తో నా పెళ్ళి నిశ్చయమైంది" అందామె.

అనుకోకుండా లభించే 'ప్రశంస' అంతగా మనిషికి మరేదీ ఉత్సాహాన్ని కలిగించ లేదు. నిజంగా ఉన్నదాని కంటె బాగా ఉన్నా మనే భావనను కలిగించడం మాత్రమే కాదు; నిజంగా బాగా తయారవడానికి కూడా సాయం చేస్తుంది ప్రశంస!

ఒక వర్తకుడు ఒక టాక్సీవాని నిజాయితీని మెచ్చుకోడం ఆ టాక్సీవాణ్ణి మరింత నిజాయితీపరుణ్ణి చేసింది. హృదయపూర్వకమైన ప్రశంసల వల్ల అత్యద్భుతమైన ఫలితాలు సాధించవచ్చు!

## బొమ్మలలో హాస్యం

### కొత్త కుక్క కరుస్తుందా ?

మీరుకొన్నకొత్త కుక్కను నన్నువచ్చి చూడమంటూరా? మరి అది కరవదుగా?

ఆ సంగతేదో తెలుసుకోడానికేగా మిమ్మల్ని రమ్మంటున్నా!



ఒక ట్రాఫిక్ పోలీస్ సమర్థతనూ, మర్యాదనూ మెచ్చుకున్న ఒక టూరిస్ట్ ఆ పోలీసు హృదయపూర్వకమైన అభినందనలు అందుకున్నాడు. అలసి సొలసి నీరసంగా కనిపించే ఒక హోటల్ వెయిటర్‌ని మెచ్చుకోడంవల్ల ఒక ఫిలింస్టార్‌కి ఆ హోటల్‌లో ఉన్నన్ని రోజులూ చక్కని పరిచర్య లభించింది.

కొన్నాళ్ళ క్రితం ఒక స్త్రీ ఒక మనశ్శాస్త్రవేత్త వద్దకు వచ్చి తన భర్తకు విడాకు లివ్వ దలుచుకున్నాననీ, అతని మనస్సును తీవ్రంగా గాయపరిచేందుకు ఏ పని చెయ్యడానికైనా తను సిద్ధమే అనీ అంది. ఆ మనశ్శాస్త్రవేత్త ఆమె కిలా సలహా ఇచ్చాడు: "మీ ఆయన మనస్సు బాగా గాయపరచా లంటే ఒక పని చెయ్యి. ముందుగా రోజూ అతణ్ణి పొగడడం,

(మిగతా 60వ పేజీలో

"సంతోషాన్ని మించిన సౌందర్య సాధనం మరి లేదు." —లేడీ జెస్సింగ్ టన్

# స్పాట్ లైట్

## అంతరిక్షంలో తొలి భారతీయుడు

# రా ష్ శర్మ




రాకేష్ శర్మ

తొలి భారతీయ అంతరిక్ష యాత్రికుడు స్క్వాడ్రన్ లీడర్ రాకేష్ శర్మ భూమిచుట్టూ పరిభ్రమిస్తున్న సోవియెట్ కృత్రిమ ఉపగ్రహ కేంద్రం 'శాల్యూట్-7' లో వారం రోజులు గడిపి రష్యన్ సహ వ్యోమగాములు యూరీ మాలిషేవ్, గెన్నడీ స్ట్రికలోవ్‌లతో సహా ఏప్రిల్ 11 న సురక్షితంగా భూమిమీదికి తిరిగి వచ్చాడు. అంతరిక్ష కేంద్రం నుంచి వారిని భూమిమీదికి తెచ్చిన 'సోయుజ్ టి-10' అనే అంతరిక్ష నౌక సోవియెట్ మధ్య ఆసియాలోని అర్కాలిక్ పట్టణం సమీపంలో మృదువుగా భూమిమీద వాలింది.

ఏప్రిల్ 3 న స్క్వాడ్రన్ లీడర్ శర్మనూ

---

## భావ పరిచయ పోటీ

(మే 1984)



"నరునికన్న వానరమే నయం -
కృతజ్ఞతతో చేస్తున్నది సహాయం!"
—అద్దేపల్లి భరత్‌కుమార్, బాపట్ల.

* * *

"నీకు నేను, నాకు నువ్వు—
లేరు మనకు ఇంకెవరూ!"
—కె. పాండురంగ ప్రసాద్, ఒంగోలు.

* * *

"జ్ఞాతి చేయని సేవ కోతి చేయు!!"
—ఎస్. మధుసూదన రావు,
వసుంధర గ్రామం.

"మృగత్వం, మానవత్వం, దైవత్వం
మూడూ కలిపిన రసాయన పదార్థం నరుడు!"

మరి ఇద్దరు రష్యన్ వ్యోమగాములనూ కజక్‌స్థాన్ ఎడారి ప్రాంతంలోని బైకనూర్ కాస్మోడ్రోమ్‌నుంచి 'సోయుజ్ టి_11' అనే నౌకలో అంతరిక్షంలోకి పంపారు. అంతకుముందు ఫిబ్రవరి 8న ముగ్గురు వ్యోమగాములను 'శాల్యూట్_7' కేంద్రం వద్దకు చేరవేసిన 'సోయుజ్ టి_10' లో వారు భూమికి తిరిగి



శర్మ - అతని రష్యన్ సహచరులు

రావడంవల్ల వారిని తీసుకువెళ్ళిన సోయుజ్ టి_11 ప్రస్తుతం 'శాల్యూట్_7'కు అనుబంధింపబడి భూమి చుట్టూ పరిభ్రమిస్తూంది. వీరు వెళ్ళేటప్పటికి 'శాల్యూట్_7' కేంద్రంలో అంతకుముందు నుంచీ పని చేస్తున్న ముగ్గురు రష్యన్ వ్యోమగాములు వీరికి స్వాగతం చెప్పారు. ఏప్రిల్ 4 మధ్యాహ్నం 'సోయెజ్ టి_11' 300 కి మీ. ల ఎత్తున శాల్యూట్_7 అంతరిక్ష కేంద్రాన్ని సమీపించి, దానితో అనుబంధం ఏర్పరచుకుంది. అటు తరువాత 6 రోజులపాటు వీరు 'దూర గ్రహణం' (remote sensing), వైద్యశాస్త్రం, భౌతిక శాస్త్రాలకు సంబంధించిన పలు ప్రయోగాలు నిర్వహించారు.

ఈ వ్యోమగాములు ధరించిన 'స్పేస్ సూట్'లు సింతటిక్, ప్లాస్టిక్, రబ్బర్‌లతో తయారయినవి. అవి ఉష్ణతా నిరోధకాలు; గాలి చొరరానివి; నీటి అడుగున కూడా చూడడానికి వీలయినవి (hydroscopic)

అంతరిక్ష కేంద్రం నుంచి భూమిమీదికి తిరుగు ప్రయాణం ప్రారంభించే సమయానికి రాకేష్ శర్మ, ఆయన రష్యన్ సహచరులూ మొత్తం 125 సార్లు భూమి చుట్టూ ప్రదక్షిణాలు చేశారు. ఈ ప్రదక్షిణాలలో 9 సార్లు మాత్రమే వారు ఇండియామీదుగా ఎగరడం జరిగింది. అప్పుడు రాకేష్‌శర్మ ఇండియా భూభాగంలో 40 శాతం ఫొటోలు తీశారు. ఆరు రంగులలో మిక్కిలి సూక్ష్మమైన వివరాలతో సహా మన దేశానికి ఫొటోలు తీయడం ఇదే మొదటిసారి; స్టీరియో కెమేరాతో తీసిన ఈ ఫొటోలవల్ల మన పర్వతాల ఎత్తు తెలుస్తూంది. ఇంతకుముందు అమెరికన్ కృత్రిమ ఉపగ్రహం 'లాండ్‌సాట్' నుంచి తీసిన ఫొటోల వల్ల ఈ వివరాలు తెలియలేదు.

## దేశ రక్షణ పరిశ్రమలలో పని చేసేవారు

ఇండియాలో దేశ రక్షణ పరిశ్రమలలో దాదాపు రూ. 2,000 కోట్ల విలువచేసే సరుకులను ఉత్పాదించే 50 ఫాక్టరీలలో సుమారు 20 లక్షలమంది కార్మికుల దాకా పని చేస్తున్నారు.

"ఉచితమైన అనుకరణే మౌలిక రచన!" _వోల్టేర్

అండమాన్, నికోబార్ దీవులకు మొట్ట మొదటిసారిగా అంతరిక్షం నుంచి శ్రీ శర్మ తీసిన ఫోటోలవల్ల అక్కడ ఉన్న నూనె, గ్యాస్ ఆకరాల వివరాలూ, లోతు సముద్రంలో చేపలు పట్టేందుకు ఆ దీవులలో గల అవకాశాలూ తెలుసుకునేందుకు వీలయింది.



వెండి, జెర్మేనియమ్‌ల మిశ్ర లోహం తాలూకు నమోనాలతో శ్రీ శర్మ అంతరిక్షంలో జరిపిన అమూల్యమైన ధాతుశోధన (metallurgical) ప్రయోగాలు మిశ్ర లోహాల సూక్ష్మ రచనను గురించీ, వాటిలో కేంద్రకాలు రూపొందే ప్రక్రియలనుగురించీ, వివరంగా తెలుసుకునేందుకు తోడ్పడుతాయి. 'అధిక శీతలీకరణ' (under cooling) ద్వారా అంతరిక్షంలో తయారుచేసిన మిశ్ర లోహాలను (alloys) నౌక బయట శూన్యంలో కొంతసేపు ఉంచి, ఆ తరువాత భూమి మీదికి తీసుకువచ్చారు.

'శాల్యూట్—7' అంతరిక్ష ప్రయోగశాలలో శ్రీ శర్మ కొనసాగించిన యోగాభ్యాసాలు 'భారరహిత స్థితి', 'కదలిక జాడ్యం' (motion sickness), సుదీర్ఘ కాలం అంతరిక్షంలో ఎగరడం వల్ల ఏర్పడే మానసిక పరిణామాలు మొదలైన వాటి మీద ఆ అభ్యాసాల ప్రభావాన్ని గుర్తించడానికి తోడ్పడ్డాయి.

రాకేష్‌శర్మ జననం పాటియాలాలో, పెరిగింది హైదరాబాద్‌లో. భారత వైమానిక దళంలో పేరెన్నిక గన్న వైమానికుడు ఆయన. 1971 ఇండో పాక్ యుద్ధంలో పాల్గొని, ఎమ్.ఐ.జి. విమానంలో 21 సార్లు శత్రు స్థావరాల మీదికి వెళ్ళి దాడి చేసి

(మిగతా 64 వ పేజీలో)

## ఏమైతే ?

(మే 1984)



(ఇండియా అంతటికీ గొప్ప సినీమాస్టార్ అయిపోతే....?)

"అమ్మ బాబోయ్! మా ఆవిడ నాకు విడాకులిస్తదండి!"

—శ్రీమతి జమునా సుధాకర్, మద్రాసు.

* * *

"రాజకీయాల్లోకి మాత్రం చస్తే దిగను!"

—డా॥ దాకోజు సూర్యప్రకాష్, నగరి కటకం, శ్రీకాకుళం జిల్లా.

* * *

"'విస్డమ్' చదవడం మాత్రం మానేయను!"

—వి. వరకుమార్, హైద్రాబాద్.

"తప్పు లన్నిటికీ తలుపు మూసివేస్తే నిజ మనేది వాకిటిలోకి రాదు."

# నవభారత నిర్మాతలు

## తొలి దక్షిణాది కాంగ్రెస్ అధ్యక్షుడు

# పనప్పాకం అనంతాచార్యులు

డా॥ డి. ఆంజనేయులు

**1885** లో ఇండియన్ నేషనల్‌కాంగ్రెస్‌ను స్థాపించడంకోసం బొంబాయిలో సమావేశం అయిన 'డెబ్బయి ఇద్దరు సాహ



సుల' (brave seventy two)లో శ్రీమాన్ పనప్పాకం అనంతాచార్యులు ఒకరు. ఆ తరువాత ఆరేళ్ళకు ఆ సంస్థకు అధ్యక్షుడైన తొలి దక్షిణాది నాయకుడు ఆయనే: మద్రాసులో స్థిరపడిన తెలుగువాడు శ్రీ అనంతాచార్యులు తమిళ, ఆంధ్రుల మధ్య సాంఘిక, సాంస్కృతిక సేతువుగా పని చేశారు. 'అనంతాచార్యులు' అనే ఆయన తెలుగు పేరు తమిళుల ఉచ్చారణలో 'అనందాచార్యులు' గా మారిపోయింది

శ్రీమాన్ అనంతాచార్యులు చిత్తూరు జిల్లా కట్టమంచి గ్రామంలో జన్మించారు. చిన్నతనంలో ఆయన చాలా ఇబ్బందులు పడ్డారు. పట్టభద్రుడు కాకముందే కొంత కాలం మద్రాసులోని పచ్చియప్ప పాఠశాలలో టీచర్‌గా పని చేయవలసి వచ్చింది. 1869 లో ఆయన న్యాయశాస్త్ర పట్టభద్రులు అయారు.

---

## 10,000 ఏళ్ల క్రితం ప్రపంచ జనాభా

10,000 ఏళ్ళ క్రితం ప్రజలు ఒకచోట స్థిరపడి వ్యవసాయం చెయ్యడం మొదలు పెట్టిన కాలంలో ప్రపంచంలో మొత్తం జనాభా బహుశః 1.5 కోట్లు మాత్రమే అయి ఉండవచ్చు నని భావిస్తున్నారు.

---

"కొండంత బోధన కన్న గోరంత సాధన మిన్న!" —దాశరథి

ఆ మరుసటి ఏడే హైకోర్టులో ప్రాక్టీస్ మొదలుపెట్టారు.

అచిర కాలంలోనే న్యాయవాదిగా పేరు ప్రఖ్యాతులు సంపాదించి జీవితంలో విజయం సాధించినా, అది ఆయనకు సంతృప్తి నీయలేదు. 'మద్రాసు నేటివ్ అసోసియేషన్' కార్యదర్శిగా, ట్రిప్లికేన్ లిటరరీ అసోసియేషన్ అధ్యక్షుడుగా, 'మద్రాసు మహాజన సభ' ప్రముఖ సభ్యుడుగా నానా ముఖాలుగా ప్రజాహిత రంగంలో ఆయన చురుకుగా పని చేయడం ప్రారంభించారు. ఆ నాటి ప్రముఖులైన శ్రీ వీరరాఘవాచారియర్, రంగయ్య నాయుడు, హిందూ సంపాదకులు శ్రీ జి. సుబ్రహ్మణ్య అయ్యర్ మొదలైనవారితో బుజం బుజం కలిపి పని చేయసాగారు.

ఆ తరం నాయకులు చాలామందితో పాటు ఆయన కూడా ఏదో రూపంలో బ్రిటిష్ పెత్తనం ఇండియాకు తప్పనిసరి అని నమ్మినా, ఇండియన్‌లకు న్యాయం చేకూర్చే విషయంలో నిర్విరామంగా ఆయన పోరాడారు. వంగదేశ నాయకుడు సురేంద్రనాథ్ బెనర్జీతో చేయి కలిపి నాటి ఐ.సి.ఎస్. పరీక్షలు ఇంగ్లండ్‌లోనే కాక, ఇండియాలో కూడా జరుపుతూ ఉండా లని ఆందోళన చేశారు. 1895 నుంచి 1903 వరకూ మద్రాసు తరపున ఆయన 'సుప్రీమ్ లెజిస్లేటివ్ కౌన్సిల్'లో సభ్యులుగా పని చేస్తూ, నిర్మొహమాటంగా ప్రభుత్వ విధానాలను విమర్శించేవారు; ప్రజల హక్కులను నిర్భయంగా సమర్థించేవారు.

1885 లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ స్థాపించబడింది మొదలు 1908 లో ఆయన చనిపోయే వరకూ ఆ సంస్థతో ఆయనకు సన్నిహితమైన సంబంధం ఉండేది. కాంగ్రెస్ వర్గాలలో ఆయన సువిఖ్యాతులు. 'కాంగ్రెస్

(మిగతా 57 వ పేజీలో)

## గుడ్లగూబ మెదడులో వింత 'న్యూరోన్' లు




గుడ్లగూబ మెదడులో అంతరిక్షం పటం ఆకారంలో అమర్చబడిన 'వింత న్యూరోన్' లు ఉన్నట్టు ఇటీవలి పరిశోధనలు స్పష్టం చేశాయి. దాని మెదడులోని ఈ కణాలు వాటికి వినిపించే ధ్వనులు అడ్డంగానూ, నిలువుగానూ సరిగ్గా ఎంత దూరం నుంచి వస్తున్నదీ నిర్ణయించగలవు. అందుచేత నిర్దేశిత క్షిపణి (guided missile) అంత కచ్చితంగా గుడ్లగూబ తన లక్ష్యాన్ని చేరుకో గలదు.

"నిరంతర అధ్యయనం చేసే ఆచార్యుడే శిష్యులకు బోధించగలడు:
వెలుగుతున్న దీపమే మరో దీపాన్ని వెలిగించగలదు" —హుమయూన్ కబీర్

# గంగానది కిరు ప్రక్కలా వ్యాపించిన
# బిహార్ రాష్ట్రం




ఉత్తరాన నేపాల్, తూర్పున ప. బెంగాల్, దక్షిణాన ఒరిస్సా, నైరృతి దిశను మధ్య ప్రదేశ్, పడమట ఉ. ప్రదేశ్—ఈ హద్దుల మధ్య వ్యాపించి ఉన్న ఇండియాలోని ఒక ప్రధాన రాష్ట్రం బిహార్. దీని విస్తీర్ణం 1,73,876 చ కి.మీ లు. ఇండియా మొత్తం భూభాగంలో ఇది 5.2 శాతం. ఇక్కడి జనాభా 6.98 కోట్లు. అంటే ఇండియా జనాభాలో సుమారు 10.2 శాతం. ఈ జనాభాలో దాదాపు 9 శాతం వరకూ 'సంతాల్'లు, 'ముండా'లు, 'ఓరావన్'లు, 'హో'లు మొదలైన ఆదిమ జాతులవారు. జనాభాలో ముప్పాతిక మూడు వీసాలు హిందువులే।

ఇండియాలో వేసవి నెలలలోనూ, కొంత వరకూ శీతాకాలంలోనూ కూడా అధిక వర్షాలు పడే కొద్ది ప్రాంతాలలో బిహార్ ఒకటి. శీతాకాలం చలీ, వేసవి కాలం ఎండా- రెండూ విపరీతమే।

బిహార్ రాష్ట్ర భూభాగంలో 17 శాతం మేర అడవులు ఉన్నాయి. ఈ అడవులనుంచి వచ్చే ప్రధానమైన ఉత్పత్తులు: కలప, కేందు ఆకులు, లక్క, బంక, రెసిన్.

అక్షరాస్యుల సంఖ్య ఇండియా మొత్తం మీద 36 శాతం కాగా, ఈ రాష్ట్రంలో అది 26 శాతం మాత్రమే। మెట్రిక్యులేషన్ వరకూ బాల బాలికలకు రాష్ట్ర ప్రభుత్వం ఉచిత విద్య అందజేస్తూంది.

ఈ రాష్ట్రంలోని అధికారభాష హిందీ.

## మిక్కిలి పొడవైన బీర్ టేబిల్

ప్రపంచంలో మిక్కిలి పొడవైన బీర్ టేబిల్‌ని బవేరియా (ప. జర్మనీ)లోని 'బాడ్ స్టైబెన్'లో నిర్మించారు. తమ 150 వ వార్షికోత్సవం కోసం నిర్మించిన ఆ టేబిల్ పొడవు 777 మీటర్లు. ఎన్నో వీథుల గుండా అది వ్యాపించింది.

"ఒక తరం పోతుంది, మరో తరం వస్తుంది:
సృష్టి మాత్రం కొనసాగుతూనే ఉంటుంది।" —ఓల్డ్ టెస్టమెంట్

ఇక్కడి ప్రజలు మాట్లాడే ఇతర ప్రధాన భాషలలో ముఖ్యమైనవి: ఉర్దూ, బెంగాలీ.

'బిహార్' అనే మాట సంస్కృత పదం 'విహారం' నుంచి వచ్చింది. 'విహారం' అంటే బౌద్ధ భిక్షువుల మఠం. చాలా కాలం క్రితం, బౌద్ధమతం బాగా ప్రజాదరణ పొందిన తరువాత అనేక బౌద్ధ విహారాలు ఈ ప్రాంతంలో వెలిశాయి. ఆ విహారాల తాలూకు శిథిలాలూ, 'దీక్షా' స్తంభాలూ, ఆ నాటి శాసనాలూ, స్తూపాలూ ఎన్నో ఇప్పటికీ ఈ రాష్ట్రంలో చెదురు మదురుగా మనకు కనిపిస్తాయి. ఈ రాష్ట్రంలోని గయలో ఉన్న బోధివృక్షం (రావి చెట్టు) క్రిందనే శాక్య రాకుమారుడు గౌతముడు జ్ఞానోదయం పొంది, 'బుద్ధుడు' అయాడు.

బిహార్‌లోని మరో ప్రముఖ బౌద్ధక్షేత్రం 'నలంద'. ప్రాచీన కాలంలో క్రీ.శ. 5వ శతాబ్దంలో ఒక అంతర్జాతీయ విశ్వ విద్యాలయం ఇక్కడ ఉండేది. ఆ విద్యాకేంద్రం



బిహార్‌లో పారే ఒక నది

## శత్రు విమానాలను గుర్తించే సాధనం

బొంబాయిలోని 'టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రీసెర్చ్' వారు రాడార్ సరఫరా చేసే భోగట్టా సహాయంతో శత్రు విమానాల ఉనికిని గుర్తించి మధ్యలో అటకాయించేందుకు తోడ్పడే ఒక కొత్త సాధనాన్ని రూపొందించారు. యుద్ధరంగంలోని సైన్యాల శక్తి సామర్థ్యాలను పెంచడానికి ఈ సాధనం విశేషంగా తోడ్పడగలదు.

"దెబ్బలాడేందుకు 'సాహసం' లేనివాడూ, పరిగెత్తేందుకు
'స్థూలకాయం' అడ్డొచ్చేవాడూ మార్పు కోరడు!" —ఎల్బర్ట్ హుబార్డ్

తాలూకు శిథిలాలలో విశాలమైన మంది రాలూ, ఏరాలూ, ఉపన్యాస శాలలూ కని పిస్తాయి. ఇక్కడ ఒక 9 అంతస్తుల భవనంలో 'రత్నోదధి' అనే గ్రంథాలయం ఉండేది

నలందకు చేరువలోనే 'రాజ్ గిర్' ఉంది. ఇదే 'రాజగృహం'. సుప్రసిద్ధమైన బుద్ధుని ప్రసంగాలు కొన్ని ఇక్కడ చేసినవే!



బిహారీ గ్రామీణ స్త్రీ

ముజఫర్ పూర్ సమీపంలోని ప్రాచీన కాలపు వైశాలీ నగరం శిథిలాలు చరిత్ర విద్యార్థులను విశేషంగా ఆకర్షిస్తాయి. ఇక్కడి 'ఆమ్రపాలి' అనే వేశ్య తాలూకు మామిడి తోటలో బుద్ధుని ప్రధాన ప్రసంగాలు కొన్ని జరిగాయి.

బౌద్ధంతో పాటు జైనమతం కూడా ఈ రాష్ట్రంలో విరివిగా వ్యాపించింది. 24 వ జైన తీర్థంకరుడు మహావీరుడు ఇక్కడే జన్మించాడు. ఈ రాష్ట్రంలోని పవపురిలో ఒక సరోవరం మధ్యలో నిర్మించిన అందమైన చలువరాతి మందిరంలో మహావీరుని సమాధి ఉంది ఏటేటా దీపావళికి ఆ మహనీయునికి శ్రద్ధాంజలి ఘటించడం కోసం జైన భిక్షువులు దేశం నలుమూలల నుంచీ ఇక్కడికి వస్తారు.

బిహార్ రాష్ట్రాన్ని గంగానది రెండు విలక్షణ భాగాలుగా విభజిస్తుంది. ఉత్తరాన ఉన్న ప్రాంతం గంగానదివల్లా, నేపాల్ నుంచి ప్రవహించి వచ్చి దానిలో కలిసే కొన్ని ఉపనదులవల్లా మిక్కిలి సారవంతం అయిన మైదానం. రాష్ట్రంలో మూడింట రెండు వంతులు ఉన్న ఈ ఉత్తర ప్రాంతంలో వరి, గోధుమ, బార్లీ, ఉలవలు, అలచందలు, లిన్ సీడ్, ఆవాలు, పొగాకు, జనుము. మిర్చి. బంగాళా దుంపలు_ఇవీ, అదీ అనేమిటి_సమస్త పంటలూ పండుతున్నాయి.

దక్షిణాన ఉన్న భాగం దట్టమైన అడవులతో కూడిన ఛోటా నాగపూర్ పీఠభూమి. ఇక్కడి కొండలే బిహార్ లోని ఆదిమ వాసు

---

## ఉన్నది ఒక్కటే మతం!

ఉన్నది ఒక్కటే కులం -
అది 'మానవ' కులం
ఉన్నది ఒక్కటే భాష -
అది 'హృదయ' భాష
ఉన్నది ఒక్కటే మతం -
అది 'ప్రేమ' మతం
ఉన్నది ఒక్కడే దేవుడు -
ఆయన సర్వాంతర్యామి!

—సత్యసాయిబాబా

"ఆగంతుకులకు ఆతిథ్యం ఇవ్వడం మరువకు;
అనుకోకుండా దేవతలకు కొందరు ఆతిథ్యం ఇచ్చారు." —న్యూ టెస్టమెంట్

లకు ఆవాసాలు. ఇనుము, బొగ్గు, రాగి, మైకా మొదలైన ఖనిజాలు ఇక్కడ విస్తారంగా లభిస్తున్నాయి. ఝూరియా, ధనబాద్‌లలో నేల కాస్త గీకితే చాలు రాశిపి బొగ్గు బయట పడుతుంది.

పల్లెలు ఎక్కువగా ఉన్న రాష్ట్రం బిహార్. జనాభాలో అధిక భాగం పల్లెలలో నివసిస్తున్నారు. వ్యవసాయం ప్రజలకు ప్రధానవృత్తి. ప్రజలలో 77 శాతం వ్యవసాయదారులే: స్త్రీలూ, పురుషులూ కూడా ఒళ్ళు వంచి పని



పవర్ స్టేషన్

చేస్తారు. తీరిక వేళలలో స్త్రీలు 'సిక్కి' అనే ఒక రకం గడ్డితో రక రకాల వస్తువులు తయారు చేస్తారు. బిహారీ పడుచు పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళేటప్పుడు అరణంగా ఆమె కిచ్చే వస్తువులన్నీ ఈ సిక్కిగడ్డి పెట్టెల లోనే పెట్టి ఇస్తారు.

మొత్తం భూభాగంలో 50 శాతం సాగు కింద ఉంది. సాగుచేయ దగిన భూమిలో 26 శాతం భూములకే నీటి వసరు ఉంది. కోశీ, గండక్, సోనే, బాడువా, చందన్, ఉత్తర కోయెల్, భాగ్మతీ నదులమీద ప్రధానమైన ఆనకట్టలెన్నో నిర్మిస్తున్నారు. తూర్పు కోశీ కాలువ వల్ల రాష్ట్రంలో ఈశాన్య భాగాన ఉన్న పూర్ణియా జిల్లా సస్య శ్యామలం అయింది. ఇక్కడ ఏటా రెండూ, ఒక్కొక్కప్పుడు మూడూ కూడా పంటలు పండిస్తున్నారు. అమెరికాలోని టెన్నెసీ లోయ పథకాన్ని పోలిన ఇక్కడి దామోదర లోయ ప్రాజెక్ట్ ద్వారా దామోదర నదికీ, దాని ఉపనదులకూ పలు ఆనకట్టలు కట్టి, వరద నీటిని వృథా కానీయకుండా జలవిద్యుచ్ఛక్తి ఉత్పాదనకూ, సాగుకూ వాడుక చేస్తున్నారు.

ఈ రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి ఉత్పాదన 1981-82లో 2,581 మెగావాట్ల స్థాయి నందుకుంది. 1981 నాటికి ఇక్కడ విద్యుచ్ఛక్తి సరఫరా అవుతున్న గ్రామాల సంఖ్య 21,703. 'పత్రతు', 'బరౌనీ' విస్తరణ పథకాలను శీఘ్రకాలంలో అమలు చేయడంతో పాటు, ముజఫర్‌పూర్, తెనూఘాట్ థెర్మల్ విద్యుచ్ఛక్తి కేంద్రాలూ, కోయెల్ కారో జల విద్యుచ్ఛక్తి కేంద్రం లాంటి క్రొత్త ప్రాజెక్టుల నిర్మాణం ద్వారా కూడా విద్యుచ్ఛక్తి ఉత్పాదనను పెంపొందించేందుకు భారీ ఎత్తున ప్రయత్నాలు జరుగుతున్నాయి. కాల్‌గాంగ్

(మిగతా 50వ పేజీలో)

## పురుషుల సగటు ఆయుర్దాయంలో జపాన్ అగ్రస్థానం

1982 లో జపాన్‌లోని పురుషుల సగటు ఆయుర్దాయం 74.22 సం. లు; స్త్రీల సగటు ఆయుర్దాయం 79.66 సం. లు. పురుషుల సగటు ఆయుర్దాయంలో ప్రపంచంలో జపాన్‌దే అగ్రస్థానం. స్త్రీల విషయంలో సగటు ఆయుర్దాయం 79.7 సం. లు ఉన్న ఐస్‌లాండ్‌ది అగ్రస్థానం:

"పరుల దైన్యాన్నీ, నమ్మే లక్షణాన్నీ ఉపయోగించుకొని
పైకి ఎగబ్రాక జూడని వాంఛ లన్నీ మంచివే:" —జోసెఫ్ కొనార్డ్

# ప్రసిద్ధ శాస్త్రజ్ఞులు

## టోర్జ్ బోర్న్ ఓ. కాస్పెర్సన్

మానవుడు ఎదుర్కొంటున్న బ్రహ్మాండమైన సవాలు - 'ప్రాణం' రహస్యాన్ని- తెలుసుకునేందుకు చేరువగా సైన్స్‌ను తీసుకు



వెళ్ళిన సుప్రసిద్ధ శాస్త్రవేత్త-స్వీడెన్ దేశీయుడైన టోర్జ్ బోర్న్ ఓ. కాస్పెర్సన్. జీవ కణాలలోని సూక్ష్మాతి సూక్ష్మ భాగాలను కూడా పరిశీలించేందుకూ అక్కడ ఏమి జరుగుతున్నదీ గుర్తించేందుకూ కావలసిన పరికరాలనూ, ప్రక్రియలనూ ఆయన కనుగొన్నారు.

ఆ పరికరాలనూ, ప్రక్రియలనూ వాడుక చేసి ఆయనే స్వయంగా జీవ కణాలలోని ప్రధాన భాగాలయిన రాసాయనిక పదార్థాలనూ, జీవ కణ కేంద్రకంలోని ఆమ్లాలనూ ఆవిష్కరించారు. జీవ కణానికీ, దాని అభివృద్ధికీ

---

## ముఖచిత్ర వ్యాఖ్య

(మే 1984)



"అమ్మ ఒడిలో పాపాయీ!
అవుతావా మరో రాకేష్‌వి!"

—ఇ. పద్మావతి, విజయనగరం.

* * *

"అమ్మ చంకలో నవ్వే బొమ్మా!
ఇంతకూ నీ వెవరమ్మా?"

—డబ్ల్యు. పండితరాయలు, కోనూరు.

* * *

"ముసి ముసి నవ్వుల
విరిసిన వెన్నెల!"

—బి ఎస్. శ్రీనివాసరావు, నల్గొండ జిల్లా.

---

"పూర్వీకులలో ఎవరో ఒకరు బానిస అయి ఉండని రాజు లేడు:
పూర్వీకులలో ఎవరో ఒకరు రాజు అయి ఉండని బానిస లేడు!" -హెలెన్ కెల్లర్

కీలకం ఆ అమ్లాలలోనే ఉందని నేడు చాలా మంది నిపుణులు భావిస్తున్నారు.

స్వీడెన్‌లోని మొటాలాలో 1910 అక్టోబరు 15న కాస్పెర్సన్ జన్మించారు. స్టాక్ హోమ్‌లోని కరోలిన్‌స్కా ఇన్‌స్టిట్యూట్‌లో వైద్యశాస్త్రం అధ్యయనం చేసి 1936 లో ఎమ్.డి. పట్టం పొందారు. అనంతరం 'వైద్య భౌతిక శాస్త్రం' (Medical Physics) లో కూడా పట్టభద్రు లయారు. వైద్య విద్యార్థిగా ఉన్న కాలంలోనే 'జీవకణ రాసాయనిక విజ్ఞానం' (cytochemistry) పట్ల ఆయన ఎక్కువ ఆసక్తి ప్రదర్శించారు. జీవకణంలోని మిక్కిలి సూక్ష్మమైన అంగాల పరిశీలనకు ఆ నాడు వాడుకలో ఉన్న విధానాలకంటె మరింత పటిష్ఠమైన విధానాల కోసం ఆయన అన్వేషింప సాగారు. జర్మన్ కోహ్లార్ కనిపెట్టిన అల్ట్రా వయొలెట్ మైక్రోస్కోప్ తన ప్రయోగాలకు బాగా ఉపయోగ పడగలదని ఆయన గుర్తించారు. అంతకు ముందు జీవకణ పరిశీలనలో ఆ మైక్రోస్కోప్ నెవరూ వాడుకచేయలేదు.

మామూలు కాంతిని కాకుండా ఆ దుర్భిణీ యంత్రం (micro-scope)లో అల్ట్రా వయొలెట్ కిరణాలను ఉపయోగిస్తారు. గాజు లెన్స్‌ల (భూతద్దాల) స్థానే 'క్వార్ట్జ్' వాడుక చేస్తారు. ఆ దుర్భిణీ యంత్రాన్ని తన అవసరాల కనుగుణంగా కాస్పెర్సన్ తిరిగి నిర్మించుకున్నారు. జీవకణంలోని లోపలి భాగంలో జరిగే సంకీర్ణప్రక్రియలను ఫొటో తీయడానికి ఆయన దానిని ఉపయోగించారు. జీవకణంలో అంతకు ముందు ఏ శాస్త్రవేత్తా కూడా ఫొటోలు తీసి ఉండని వివరాల నెన్నిటినో ఆ విధంగా ఆయన మొట్టమొదటిసారిగా ఫొటో తీయగలిగారు.

ఈ 'మైక్రో స్పెక్ట్రో ఫొటో మీటర్' సాయంతో కాస్పెర్సన్ జీవ కణ రసాయన విజ్ఞానాన్ని కొన్ని దశాబ్దాలు ముందుకు తీసుకుపోయారు. ఆయన కనిపెట్టిన ఆ పరికరాన్నీ, ఆయన ఉపయోగించిన విధానాలనూ యూరప్‌లోనూ, అమెరికాలోనూ ఉన్న శాస్త్రవేత్త లందరూ ఉపయోగింప సాగారు.

## ఉపాధ్యాయుల విద్యా ప్రమాణాలు




"ప్రస్తుతం మన దేశంలో ఉన్న విద్యా ప్రమాణాల స్థాయి దృష్ట్యా ఎలిమెంటరీ స్కూలు పిల్లలకు పాఠాలు చెప్పేందుకు ఎం.ఏ., పి.హెచ్.డి డిగ్రీ ఉన్నవారిని తప్ప ఇతరులను మేము నియమించ దలుచుకోలేదండీ!"

"కోతి తలమీద బంగారు కిరీటం పెట్టినట్టు!"

ఆ పరికరాన్ని ఉపయోగించి కాస్పెర్సన్ స్వయంగానే ఎన్నో నూతన విషయాలు కనుగొన్నారు. మనం నమ్మలేనంత సన్నని ధాతు తంతువులను ఆయన పరిశీలించి, మానవ, జంతు, వృక్ష జీవ కణా లన్నీ సమానంగా నిర్వహి స్తున్న ప్రాథమిక ప్రక్రియ ఒకటి ఉన్న దనీ, అది 'అమెనో' అమ్లాలను ఏకీకరించి 'మాంసకృత్తు'ను తయారు చేయడం అనీ రుజువు చేశారు. ఒక చెట్టు, ఒక మనిషి, ఒక పక్షి-దేనిలోని జీవకణాన్ని తీసుకున్నా దాని ముఖ్య కర్తవ్యం కండరాల, అవయవాల పోషణకు అత్యవసరమైన 'మాంసకృత్తు'లను ఉత్పాదన చెయ్యడమే!

కాస్పెర్సన్ సాగించిన ప్రయోగాలను చాలావరకు జీవ కణ కేంద్రక రసాయనాల పరిశోధన మీదే కేంద్రీకరించారు. చక్కెర (లేదా చక్కెర నుంచి ఉత్పాదితమైన పదార్థాలు) ఫోస్పరిక్ ఆమ్లంతో సంయోగం చెందుతూ ఉండడమే జీవకణ కేంద్రకంలో ముఖ్యంగా కనిపించే ప్రక్రియ.

వైద్య విద్యార్థిగా ఉన్న రోజులలోనే జీవకణ కేంద్రకంలోని రసాయనాలు 'జీన్'ల లోనే అంతర్గతంగా ఉన్నా యని కాస్పెర్సన్ గుర్తించారు. కాలక్రమేణ ఒక జీవకణం రెండుగా చీలిపోయే ప్రతి సందర్భంలోనూ దాని కేంద్రకంలోని అమ్లాల చిక్కదనం ఎక్కువ అవుతుం దని ఆయన కనుగొన్నారు. ఇలా అమ్లాల చిక్కదనం పెరగడం గర్భస్థమైన మానవ పిండం త్వరిత గతిని పెరిగే సందర్భాలలో మరింత స్ఫుటంగా కనిపిస్తుంది.

జీవకణం 'మాంసకృత్తు'ను ఉత్పత్తి చెయ్యా లంటే ఒక ప్రత్యేక రకం కేంద్రకామ్లం (ఈ అమ్లాలలో రెండు రకా లున్నాయి) అవసరం అన్న సుప్రసిద్ధ సిద్ధాంతాన్ని కాస్పెర్సన్ ప్రతిపాదించారు. 'జీన్'లలో కనిపించే అనువంశిక లక్షణాల (hereditary properties) మీద కూడా ఈ కేంద్రక అమ్లాల ప్రభావం అధికంగా ఉందని ఆయన నిరూపించారు.

కాస్పెర్సన్ కొనసాగించిన పరిశోధన వైద్యరంగంలోకి కూడా విస్తరించింది. ఆయన లక్ష్యాల జాబితాలో 'కేన్సర్' అగ్రస్థానం ఆక్రమించింది. కేంద్రక అమ్లాలలో

## ఆర్మీనియా రిపబ్లిక్‌లో 7,000 శతవృద్ధులు



రష్యాలోని ఆర్మీనియా రిపబ్లిక్‌లో దాదాపు 7,000 దాకా శతవృద్ధులు ఉన్నారు. వారిలో 2/3 వంతుల మంది స్త్రీలు. కొండల గాలి, సీటి బుగ్గలలోని నీరు, నిరంతర శరీర వ్యాయామం వారి దీర్ఘాయుర్దాయానికి దోహదం చేస్తున్నాయి. అక్కడి శతవృద్ధులలో ఒకడైన 105 ఏళ్ళ 'ఐకనూష్'కి చూపూ, జ్ఞాపకశక్తీ చెక్కు చెదరలేదు.

"ఇత్తడి నగలో తాపటం చేసినా కెంపు కెంపే!"

వచ్చే పరిణామాలు ట్యూమర్‌లు ఏర్పడడంలో ప్రముఖ పాత్ర వహిస్తున్నాయనడానికి తగినంత బలమైన సాక్ష్యాన్ని ఆయన సేకరించారు. కేంద్ర కామ్లాలకూ, 'వైరస్' మూలాన వ్యాపించే వ్యాధులకూ (కేంద్ర నాడీమండల వ్యాధులతో సహా) మధ్య ఉన్న సంబంధాన్ని కనుగొనేందుకు ఆయనా, ఆయన సహచరులూ తీవ్రంగా కృషి చేశారు. మానసిక వ్యాధులతో బాధపడే రోగుల నాడీ కణాలలో కనిపించే అసాధారణ పరిస్థితులను కొన్ని రసాయనాలవల్ల నివారించడానికి వీలవుతుందేమో అని కూడా వారు ప్రయోగాలు చేసి చూశారు.

చాలా మంది జీవశాస్త్రజ్ఞులు కాస్పెర్సన్‌తో అభిప్రాయ భేదాలు ప్రకటించిన వారున్నా యూరప్‌లోనూ, అమెరికాలోనూ కూడా ఆయన ఆవిష్కరణల పట్ల విశేష గౌరవం ప్రకటిత మైంది.

తొలి దశలో ఆయన పరిశోధన రంగం 'కరోలిన్‌స్కా ఇన్‌స్టిట్యూట్'. అక్కడ క్రమంగా ఆయన 'వైద్య జీవకణ' పరిశోధనలోనూ, ఉత్పత్తి శాస్త్రం (genetics) లోనూ ప్రొఫెసర్ స్థాయికి ఎదిగారు. 1944 లో ఆ రంగంలో కృషి చేసే 'నోబెల్ మెడికల్ ఇన్‌స్టిట్యూట్'కి డైరెక్టర్ అయారు. 1948 లో స్వీడెన్ రాజధాని స్టాక్‌హోమ్‌లో ఆయన పరిశోధనల కోసం ప్రత్యేకంగా ఒక అద్భుతమైన 'లేబొరేటరీ'ని నిర్మించారు. 1950లో ప్రయోగాత్మక జీవకణ శాస్త్రానికి సంబంధించిన వాలెన్‌బర్గ్ లేబొరేటరీకి కూడా ఆయనను డైరెక్టర్‌ని చేశారు.

జీవకణం తాలూకు రహస్యాలను కనుగొనడంలో ఆయన సాధించిన అభివృద్ధి ఆయన దృష్టిలో ఆ రంగంలో మరింత తీవ్రమైన పరిశోధన చెయ్యడానికి ఒక ఆహ్వానం మాత్రమే: ఆయన ఇలా అన్నారు: "సూక్ష్మాతి సూక్ష్మమైన అంశాలను పరిశీలించి కొన్ని రహస్యాలను భేదిస్తాము. కాని, వెంటనే అంతకంటె సూక్ష్మమైన అంశాలు ఎదురై, మనం పరిష్కరించవలసిన సమస్యలు ఇంకా చాలా ఉన్నాయని మనకు అర్థం అవుతుంది." ●

## మిక్కిలి బరువున్న శిశువు



ప్రస్తుతం 11 నెలలు నిండిన-ప్రపంచం అంతటిలో మిక్కిలి బరువైన - శిశువు బరువు 25 కి. గ్రాములు. దక్షిణాఫ్రికాలోని ఒక ఆసుపత్రిలో ఆ శిశువు జన్మించినప్పుడే 10.2 కి. గ్రాములు తూగాడు. ఆ బాలరాకాసికి ఆకలి విపరీతం. తల్లి దగ్గరి పాలు చాలక రెండురోజుల కొక 500 గ్రా ల పాల డబ్బా ఖాళీ చేస్తాడు. ఇవి కాక, ఉడకబెట్టిన బంగాళా దుంపలు, మాంసం లాంటి ఘనాహారం కూడా కావాలి!

"చిన్న చిన్న విషయాలను గూర్చి ఎక్కువెక్కువ తెలిసినవాడు ఎక్స్‌పర్ట్!" —నికోలాస్ ఎమ్. బట్లర్

# క్రీడలు - వినోదాలు

## ఫుట్ బాల్ ఆట

ఇండియాలో ఎక్కువగా జనాదరణపొందిన క్రీడలలో ఫుట్ బాల్ ఒకటి. ప్రతి ఏడూ ఒక కోటి మందికి పైగా ప్రేక్షకులు వివిధ కేంద్రాలలో జరిగే ఫుట్ బాల్ పోటీలను ప్రత్యక్షంగా తిలకిస్తున్నారు. వీరు కాక



లక్షలకొద్దీ మంది టెలివిజన్‌లో ఆ పోటీలను చూసి ఆనందించేవా రున్నారు. మంచి చలాకీతనం, చురుకుదనం ప్రదర్శించే ఆట ఫుట్ బాల్.

జట్టుకు 11 మంది ఆటగాళ్ళు ఉండే రెండు జట్ల మధ్య ఈ ఆట సాగుతుంది. 15 ని. లు వ్యవధి గల నాలుగు దఫాలుగా పోటీ జరుగుతుంది. 90 మీ.ల పొడవు, 48 మీ ల వెడల్పు గల క్షేత్రంలో ఈ ఆట ఆడుతారు. H ఆకారంలో ఉండే రెండు పెద్ద కొయ్య స్తంభాలు గోల్‌లుగా క్షేత్రానికి ఈ చివరా, ఆ చివరా అమరుస్తారు. క్షేత్రంలో ప్రతి 9 మీటర్లకూ, సున్నంతో ఒక బద్దీ గీయబడి ఉంటుంది. 30 సెం.మీ.ల వ్యాసం గల-లోపల గాలి పూరించిన - రబ్బరు తిత్తి, పైన తోలు కవరూ ఉన్న బంతిని ఈ ఆటలో వాడుక చేస్తారు.

బంతిని తన్నుకుంటూ పోయిగాని లేదా తమ జట్టు ఆటగానికి 'పాస్' చేసి గాని ఎదిరి

---

## మిక్కిలి పల్చని కాల్‌క్యులేటర్

ప్రపంచంలో 'పోకెట్ ఎలెక్ట్రానిక్ కాల్‌క్యులేటర్' లను అత్యధికంగా ఉత్పత్తి చేసే జపాన్‌లోని 'కాసియో' అనే కంపెనీ ఇటీవల 0.8 మిల్లీమీటర్ (అంగుళంలో 3/1000 వ వంతు) మందం గల కాల్‌క్యులేటర్ తయారు చేసింది. 'ఎస్ 1-100' అని పిలువబడే ఈ కాల్‌క్యులేటర్‌లో మామూలు బాటరీలు కాక సూర్యకాంతితో పని చేసే సౌర శక్తి ఘటాలు (cells) ఉంటాయి.

---

"సంయమం సాధించిన విద్యార్థి మనస్సుకు పరమాణువు మొదలు పరబ్రహ్మం దాకా అన్నీ వశం అవుతాయి!" — పతంజలి

పక్షం వారి గోల్ గుండా కొట్టడం ఈ ఆటలో ప్రధాన ధ్యేయం. అలా గోల్ సాధించిన జట్టుకి 6 పాయింట్లు వస్తాయి. అలా గోల్ చేసిన తరువాత వెంటనే గోల్ స్తంభాల మధ్య అడ్డుగా వేసిన కమ్మీమీదుగా బంతిని తంతే మరో పాయింట్ అదనంగా లభిస్తుంది.

కేంద్రానికి కొద్దిదూరంలో ఉండే ఒక



గీత నుంచి ఎవరో ఒక ఆటగాడు బంతిని తన్నడంతో పోటీ ఆరంభం అవుతుంది. అలా బంతిని తన్నేవారి జట్టు కాపు కాసుకునే జట్టు (defence team)గానూ, రెండోది ఎదిరించే జట్టు (offence team) గానూ పరిగణింపబడతాయి. అలా తన్నిన బంతిని అందుకునే ఎదిరి జట్టు ఆటగాళ్ళు కాసుకునే జట్టు వారి గోల్ గుండా బంతిని తన్నడానికి ప్రయత్నిస్తారు. ఏదో ఒక జట్టు గోల్ సాధించేదాకా ఎడ తెరిపి లేకుండా ఆట సాగుతుంది. అప్పుడు 'గోల్' సాధించిన జట్టు ఆటగాడు మళ్ళీ మధ్యరేఖ నుంచి బంతిని తంతాడు.

ప్రాచీన గ్రీస్, రోమ్ దేశాలలో ఫుట్ బాల్ ఆట మొదట ఆరంభం అయిందని నిస్సందేహంగా చెప్పవచ్చును. అయితే, ఈ ఆటతో కొన్ని పోలికలు గల 'ట్సు-చు' అనే



ఒక ఆట క్రీ.పూ. 4వ, 3వ శతాబ్దాలలో చైనాలో ప్రచారంలో ఉండేది. 10 వ శతాబ్దం ప్రాంతంలో ఫుట్ బాల్ ఇంగ్లండ్ కి దిగుమతి అయి, అక్కడ బాగా ప్రజాదరణ పొందింది. కాని 12 వ శతాబ్దంలో దేశ రక్షణకు మిక్కిలి అవసరమైన ధనుర్విద్య ఈ ఆట మూలంగా మూలపడుతూం దనే కారణంతో

---

## 'ఇండియాలో సాలుసరి పాల ఉత్పత్తి

ఇండియాకు ఏటా 5 కోట్ల టన్నుల పాలు అవసరం కాగా, ప్రస్తుతం ఇక్కడ 3.5 కోట్ల టన్నుల పాలు మాత్రమే ఉత్పత్తి అవుతున్నాయి. ఈ పాలలో ఎక్కువ భాగం గేదె పాలు. మన దేశంలో ప్రస్తుతం 2 కోట్ల గేదెలూ, 2.7 కోట్ల ఆవులూ ఉన్నట్టు అంచనా.

"ఒకే సూర్యుడు ప్రపంచాన్నంతా వెలిగిస్తున్నట్టు ఒకే ఆత్మ అందరిలోనూ ప్రకాశిస్తూంది." —శ్రీకృష్ణ పరమాత్మ

అప్పటి ఇంగ్లండ్ రాజు రెండవ హెన్రీ ఈ ఆటను అదేశంలో నిషేధించాడు. 17 వ శతాబ్దంలోగాని మళ్ళీ ఆ నిషేధం తొలగించబడ లేదు. 1800 నాటికి ఇంగ్లండ్ అంతటా మళ్ళీ ఈ ఆట బాగా ప్రచారంలోకి వచ్చింది.

ఆ రోజులలో అన్ని రకాల ఫుట్‌బాల్ విస్తృతంగా వాడుకలోకి వచ్చింది.

19 వ శతాబ్దం అంతా ఫుట్‌బాల్ ఆటకు కచ్చితమైన సూత్రాలు ఏవీ ఏర్పడలేదు. కేవలం కండబలం ఉన్న ఆటగాళ్ళదే పై చెయ్యిగా ఉండేది. చాలా మందికి తీవ్రంగా దెబ్బలు తగిలేవి. ఆ పద్ధతికి క్రమంగా ప్రేక్



ఫుట్‌బాల్ పోటీ చూస్తున్న ప్రేక్షకులు

ఆటలలోనూ బంతిని కాలితో తంతూనే గోల్ వద్దకు తీసుకు వెళ్ళాలి గాని, చేతితో పట్టుకొని పరుగెత్తడం అనుమతించేవారు కాదు. 1823 లో ఇంగ్లండ్‌లోని రుగ్బీ కాలేజ్ విద్యార్థి ఒకడు కాలితో బంతిని పైకి లేపి తన్నలేక చేత్తో పట్టుకొని పరుగెత్తాడు. అనుకోకుండా ఆ కుర్రవాడు చేసిన పని కొత్త రకం ఫుట్‌బాల్ ఆటకు దారి తీసింది. చేతితో బంతిని పట్టుకొని పరుగెత్తడం అనుమతించబడింది.

అమెరికా వలస రాజ్యంలోకి 17 వ శతాబ్దంలో ఫుట్‌బాల్ ఆటను మొదట ప్రవేశ పెట్టారు. గత 100 ఏళ్ళలోనూ ద. అమెరికా, యూరప్, ఆసియాలలో కూడా ఈ ఆట

కులు నిరసన తెలుపసాగారు. 1906 లో ఆటగాళ్ళంతా ఒక చోట గుమి గూడడం

## కుక్క కాటుకు పరిహారంగా రూ. 30 లక్షలు!

హానోలూలూ (హవాయ్ దీవులు) లోని ఒక డాక్టరు తాను కుక్క కాటుకు గురి అయినందుకు పరిహారంగా 3 లక్షల డాలర్లు సుమారు (రూ. 30 లక్షలు) రాబట్టారు. ఒక పెట్రోల్ పంప్ యజమానికి చెందినది ఆ కుక్క. మరమ్మతుల కోసం తన కారును ఇవ్వడానికి వెళ్ళిన డాక్టరును ఆ కుక్క కరచింది.

"ఆకాశంలో మబ్బూ, అంబుధిలో నీరూ ఒక్కటే!
బాహ్యమైన వియోగం వాటి ఏకత్వాన్ని మరింత బల పరుస్తుంది." —టాగూరు

మోటుగా ఎదుటివాణ్ణి ఎదిరించడం లాంటి చర్యలు నిషేధించబడ్డాయి.

ఇటీవలి కాలంలో చాలా సంకీర్ణమైన, ఉపయోగకరమైన క్రీడగా ఫుట్‌బాల్ అభివృద్ధి పొందింది. క్రీడాకారులకు తగిన శిక్షణ ఇస్తున్నారు. ఫుట్‌బాల్ పోటీలను - తరువాత సంప్రదించడానికి వీలుగా- ఫిల్మ్ తీస్తున్నారు. 50,000 మొదలు లక్ష మంది దాకా ప్రేక్షకులు కూర్చుని ఈ ఆట చూడడానికి వీలైన విశాలమైన స్టేడియమ్‌లు నిర్మించి, వాటిని సక్రమంగా నిర్వహిస్తున్నారు.




అసోసియేషన్ ఫుట్‌బాల్ ఆటను ప్రపంచంలో ఇంచుమించు అన్ని దేశాలలోనూ ఆడుతున్నారు. ద అమెరికా, యూరప్‌లలో అది మరింత బలం పుంజుకుంది. 'వరల్డ్ కప్' కోసం 4 ఏళ్ళ కొకసారి అంతర్జాతీయంగా వచ్చే వివిధ జట్ల మధ్య పోటీలు జరుగుతున్నాయి. టెలివిజన్‌ద్వారా ప్రపంచం అంతటా కోట్లకొద్దీ ప్రేక్షకులు ఆ పోటీలను చూసి ఆనందిస్తున్నారు.

ఫుట్‌బాల్ ఆటలో ఆరితేరిన క్రీడాకారులెందరో తయారయారు. అయితే ఇటీవలి దశాబ్దాలలో ద. అమెరికా, యూరప్ ఆటగాళ్ళు ప్రేక్షకుల నెక్కువగా ఆకర్షిస్తున్నారు. ఇంగ్లండ్ ఫుట్‌బాల్ క్రీడాకారుడు సర్ స్టాన్లీ



చున్నీ గోస్వామి

మాథ్యూస్ 'విజార్డ్ ఆఫ్ డ్రిబ్లో' (బంతి పాస్ చెయ్యడంలో మేటి) అని ప్రసిద్ధి పొందాడు.

(మిగతా 24 వ పేజీలో)

## తలసరి పప్పు దినుసుల వాడకం తగ్గుదల

1982-83 లో ప్రపంచంలో మొత్తం పప్పుదినుసుల వాడకం 1.5 శాతం పెరిగినా, జనాభా అంతకంటె ఎక్కువగా పెరగడం వల్ల తలసరి వాడకంలో స్వల్పంగా తగ్గుదల కన్పించవచ్చునని 'ఫుడ్ అండ్ అగ్రికల్చరల్ ఆర్గనైజేషన్ (FAO) తాలూకు 'ఫుడ్ ఔట్‌లుక్ రిపోర్ట్' తెలియజేస్తుంది. చైనా కాక పప్పు దినుసులు ఎక్కువగా వాడే ఇతర దేశాలలో గత 4 ఏళ్ళలో సగటు తలసరి వాడకం మిక్కిలి తక్కువ స్థాయికి వచ్చింది.

"గుర్తుంచుకో—అందరికీ సుఖాన్ని సాధిస్తే తప్ప ఏ ఒక్కడికీ అది దక్కదు!"

—సర్ జగదీశ్ చంద్రబోస్

# జాతీయ వార్తలు

## 'హాలీ' తోకచుక్క: పరిశీలన ఏర్పాట్లు

1985-86 లో భూలోక వాసులకు దర్శనం ఈయనున్న 'హాలీ' తోకచుక్క పరిశీలనకు బెంగుళూరులోని 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆస్ట్రోఫిజిక్స్' ఒక సమగ్ర ప్రణాళిక సిద్ధం చేసింది. ఆసియా అంతటిలో మిక్కిలి పెద్దదైన 90 అం. ల టెలిస్కోప్ నుంచి ఆ తోకచుక్కను భారత ఖగోళశాస్త్రవేత్తలు పరిశీలిస్తారు. ఆ టెలిస్కోప్‌ను తమిళనాడు లోని 'కవలూర్' వేధశాలలో అమరుస్తున్నారు.

* * *

## తొలి 'జనతా' కారు - మారుతి:

రూ. 47,500లు ఖరీదుచేసే తొలి 'జనతా' కారు 'మారుతి'ని ఇటీవల ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ మార్కెట్‌లో విడుదల చేశారు. రూ. 269 కోట్ల వ్యయంతో నిర్మించ బడిన ఆ ఫాక్టరీ 1984 లో 20,000 కార్లనూ, 1985 లో 40,000 కార్లనూ, 1988 నాటికి ఒక లక్ష కార్లనూ ఉత్పత్తి చేస్తుంది. 'గర్గాంవ్' (హర్యానా)లో ఉన్న ఆ ఫాక్టరీ నుంచి ప్రస్తుతం ప్రతి 800 నిముషాలకూ ఒక కారు చొప్పున బయటికి వస్తుంది.

## టీ.వీ.కి ఉప్పునీటితో నింపిన ఆంటెనా:

బెంగుళూరులోని కృత్రిమ ఉపగ్రహ కేంద్రం తాలూకు శాస్త్రజ్ఞులు ఉప్పు నీటితో

---

## వివాహ విషయంలో ఎస్కిమోల వింత ఆచారాలు



ఉత్తర ధ్రువ ప్రాంతంలోని ఆర్కిటిక్ మండలంలో నివసించే ఎస్కిమో జాతి వారిలో వివాహం అంటే పెళ్ళికొడుకు పెళ్ళికూతురును జుట్టు పట్టుకుని మంచు బండల మీద ఈడ్చుకుపోవడం. అయితే ఆ పని చేసేందుకు ముందు ఆ పిల్ల తల్లిదండ్రులు అందుకు అంగీకరించాలి. వివాహానంతరం ఒక ఏడాది పెళ్ళికొడుకు అత్తవారింట ఉండి మామగారితో పాటు వేటాడాలి. అప్పుడుగాని భార్యతో సహా అతడు తన పల్లెకు తిరిగి పోవడానికి వీలులేదు.

"ఆకులందున అణగి మణగీ 'కవిత' కోకిల పలుకవలెనోయ్!" —గురజాడ

వింపిన ఒక ప్లాస్టిక్ గొట్టాన్ని అంటెనాగా వాడి స్ఫుటమైన టెలివిజన్ సంకేతాలను రాబట్టారు. బెంగుళూరు టెలివిజన్ కేంద్రం లోని 5 వ ఛానెల్‌లో ఆ కేంద్రం నుంచి 30 కి.మీ.ల దూరం దాకా ఈ ఉప్పు నీటి అంటెనావల్ల స్ఫుటమైన చిత్రాలు అందాయి.

* * *

## భారత నౌకాదళానికి 'సీ-హారియర్' విమానాలు:

మన నౌకా దళాన్ని అధునికీకరించే ప్రక్రియలో భాగంగా 'సి-హారియర్' విమానాలను ఇండియా సమకూర్చుకుంది. ఐ.ఎన్.ఎస్. విక్రాంత్ అనే విమాన వాహక నౌక మీద నుంచి అవి ఎగురుతాయి. 'జంప్-జెట్స్' అనే మారు పేరు గల ఈ యుద్ధ విమానాలు అత్యాధునికమైన ఎలెక్ట్రానిక్ పరికరాలు కలిగి, క్షిపణులతో సహా వివిధ ఆయుధాలను శత్రు స్థావరాలమీద ప్రయోగించడంలో మిక్కిలి పటిష్ఠమైనవి.

* * *

## ముద్రితం అయిన జైనముని ప్రాచీన రచన:

సుమారు 2000 ఏళ్ళ క్రితం ప్రాకృత భాషలో కన్నడ గ్రంథ లిపిలో సుప్రసిద్ధ జైన ముని కుంద కుందాచార్యులు రచించిన 'సమయ సారం' అనే భారతీయ తాత్త్విక రచన ఇటీవల కన్నడ భాషలో ప్రకటించబడింది.

## హిమాచల్ ప్రదేశ్‌లో మిక్కిలి పెద్ద పార్కు:

సుమారు 200 చ. కి. మీ. ల విస్తీర్ణం ఉండే మిక్కిలి పెద్ద జాతీయ పార్కును హిమాచల్ ప్రదేశ్‌లో ఏర్పాటు చెయ్యబోతున్నారు. మంచు చిరుత పులులు, మంచు కోడి పుంజులు, కస్తూరి లేళ్ళు, మంచు ఎలుగుబంట్లు మొదలైన వన్యజంతువుల సంరక్షణ కేంద్రంగా ఈ పార్కును రూపొందిస్తున్నారు.

## 200 గ్రాములు తూగిన కోడి గుడ్డు



మామూలుగా ఒక కోడిగుడ్డు బరువు 60 గ్రాములు ఉంటుంది. అయితే - యూక్రేన్ (రష్యా) లోని ఏ. చిర్కో తాలూకు కోళ్ళ దొడ్డిలో ఒక పెట్ట 200 గ్రాములు తూగే గ్రుడ్డును పెట్టి కొత్త రికార్డు స్థాపించింది. నిత్యం అలాంటి రాకాసి గుడ్లను పెట్టే కోళ్ళ జాతిని ఉత్పత్తి చేయవచ్చు నని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

"మన ప్రాచీన గ్రామ పంచాయితీలు 'రిపబ్లిక్' పాలనకు చక్కని నిదర్శనాలు." — కె. ఎన్. కట్జూ

# స్త్రీలకు దేవుడి శాపం

చాలా చాలా పూర్వ కాలంలో దేవుడు ఒకప్పుడు ఒక పని మీద ఎవరినో పంపా లనుకున్నాడు. ఆ పని స్త్రీలకు అయన పురమాయించా లనుకున్నాడు. కాని, అప్పటికే స్త్రీలు ఇంటి పనులతో తల మున్కలై ఉన్నారు. "త్వరగా రండి! మీకో కొత్తపని పురమాయిస్తాను" అని దేవుడు వారిని పిలిచి నప్పుడు వారిలా అన్నారు: "ఒక్క క్షణం ప్రభూ! చేతిలో పని పూర్తి కాగానే వచ్చేస్తాం". దేవుడు కాసే పాగి మళ్ళీ పిలిచాడు. "పని పూర్తి కావచ్చింది. వచ్చేస్తున్నాం! ప్రభూ!" అన్నారే గాని అప్పటికీ స్త్రీలు తెమిలి రాలేదు.

ఆ కాలంలో పాలు తియ్యడం, ఇళ్ళు కట్టుకోడం, కట్టెలు కొట్టి తెచ్చుకోడం లాంటి పను లన్నీ స్త్రీలే చేసేవారు. పురుషులు చేసే ఒకే ఒక పని ఇంటి చుట్టూ కంచె వెయ్యడం, పశువులకు ఏ ఆపదా రాకుండా కాపాడడం—అంతే! వారి కెంతో తీరిక ఉండేది. అందుచేత వారు పరుగెత్తు కుంటూ వచ్చి, దేవుడితో "ఆ పనేదో మాకు పురమాయించండి ప్రభూ! మేము చేస్తాం" అన్నారు. స్త్రీల మీద దేవుడికి కోపం వచ్చి ఆయన వారిని ఇలా శపించాడు: "మీ పనులు ఏ ప్రొద్దుకీ తెమలకుండా ఉండు గాక! ఒక పని పూర్తికాగానే ఎప్పటి కప్పుడే మరో పని ఎదురు చూస్తూ ఉండు గాక! నేను పిలవగానే వచ్చారు గనుక పురుషులకు మాత్రం విశ్రాంతి లభించు గాక! చనిపోయే ఘడియ దాకా క్షణం కూడా స్త్రీలకు తీరికా, విశ్రాంతీ లేకుండు గాక!"

(ఉ. కెన్యాలోని 'గారీ' జానపద కథ ననుసరించి)

---

## కారుల వాడకం నిషిద్ధం అయిన దీవి



హిందూమహా సముద్రంలోని 'సెకిలీస్' దీవులలో ఒకటి అయిన 10 కి.మీ.ల పొడవు గల 'లాడిగూ' దీవిలో ఎడ్ల బళ్ళూ, సైకిళ్ళూ తప్ప ఇతర వాహనాలు లేవు. ఎవరైనా కారు వాడా లంటే కొన్ని నిర్దిష్ట కార్యాలకు మాత్రమే వాడేందుకు ప్రత్యేకానుమతి పొందాలి. ఆ కార్యం పూర్తికాగానే ఆ అనుమతి పత్రాలు రద్దయిపోతాయి. ఆ విధంగా అక్కడ వాతావరణ కాలుష్యం గాని, రణగుణ ధ్వనులు గాని లేకుండా జీవితం ప్రశాంతంగా సాగుతూంది.

---

"ఇతరుల దృష్టితో తమను తాము చూసుకోడం వ్యక్తులకూ, దేశాలకూ కూడా మేలు చేస్తుంది!" —ఆర్. కె. కరంజియా

# ఎలా?

## జున్ను చేయడం ఎలా?



పెరుగూ, దానిపైన తేరుకునే నీరూ (whey)—ఈ రెండు పదార్థాలతోనూ కూడిన పాల నుంచి జున్ను తయారు చేస్తారు. పెరుగు లేదా కాసీన్ అనే మాంస కృత్తు గట్టిగా పేరుకుంటుంది. దీనిలో నత్ర జని ఉంటుంది. జున్ను తయారీలో ఈ పెరుగుకు 'రెన్నెట్' అనబడే ఆవుదూడ 4వ కడుపు నుంచి తీసే జఠరరసం చేర్చి కలియ బెడతారు. గట్టి పడేట్టు చేసే ఈ ప్రక్రియ మన కడుపులో జరిగే జీర్ణ ప్రక్రియ లాంటిది.

పెరుగు మీద పేరుకునే నీటిని (whey), నిర్దిష్టమైన ఉష్ణోగ్రతకు వెచ్చజేసి జున్ను తయారు చేసే వ్యక్తి 'కాసీన్'తో దీనిలోని 'వెన్న-కొవ్వు' భాగాన్ని కలుపుతాడు. నిజానికి పాలు విరిగినప్పుడల్లా తయారయేది ఒక నాటురకపు జున్నే అనవచ్చును.

అచ్చమైన పాల నుంచి చేసేవీ, వెన్న తీసి వేసిన పాల నుంచి చేసేవీ, కేవలం మీగడ (double cream) నుంచి చేసేవి—ఇలా 'జున్ను'లో ఎన్నోరకాలు ఉన్నాయి ●

---

(20 వ పేజీ తరువాయి)

ఎప్పుడూ 'రైట్ వింగ్'లోనే ఆడుతూ ప్రతి పక్షం వారి రక్షణ చర్యలను విచ్ఛిన్నం చేయడంలో ఆయన ప్రదర్శించిన ప్రజ్ఞ అసాధారణమైంది. బ్రెజిల్ క్రీడాకారుడు 'పీలె' తన మొత్తం క్రీడా జీవితంలో 1200 గోల్‌లు సాధించాడు. 1970లో బ్రెజిల్ మూడవసారి 'వరల్డ్ కప్' గెలువడానికి ఆయన తోడ్పడ్డాడు. బంతిని నడపడంలోని నేర్పుతోనూ, అద్భుతమైన 'కిక్'లతోనూ ప్రేక్షకులను ఆనంద పరవశులను చేశాడు. అర్జెంటీనా జట్టులోని 'ఫార్వర్డ్' ఆటగాడు రికార్డో గారెకా 13 ఏళ్ళ అనంతరం తమ దేశం బ్రెజిల్‌ని ఓడించిన ప్రధానమైన పోటీలో విజయం సాధించిన చివరి గోల్ చేశాడు. ఇండియాలో సూచిమల్ (చున్నీ) గోస్వామి పేరెన్నిక గన్న ఫుట్‌బాల్ ఆటగాడు. ఈయన ఒక బెంగాలీ ఫిల్మ్‌లో కూడా నటించాడు. దాదాపు 80 అంతరాతీయ పోటీ ఆటలలో ఆయన ఇండియా జట్టుకు కెప్టెన్‌గా ఉన్నాడు. కలకత్తాలోని 'మోహన్ బగన్' జట్టు నాయకుడుగా ఇంచుమించు పాల్గొన్న అన్ని ప్రధానమైన పోటీలలోనూ తమ జట్టుకు విజయం చేకూర్చాడు. ●

"ప్రతి సంస్కరణోద్యమంలోనూ ఒక్క పిసరు పైత్యం కూడా కలిపి ఉంటుంది." —థియొడోర్ రూజ్వెల్ట్

# 'యేతి'ని గురించిన వింత కథలు

నేపాల్‌లో హిమాలయ పర్వత శిఖరాల మీద సంచరిస్తున్నట్టు చెప్పబడే 'యేతి' అనే వింత జంతువును గురించి రక రకాల కథలు ప్రచారంలో ఉన్నాయి. నేపాల్‌లో అవ్వలు తమ మనుమలను చుట్టూ కూచో బెట్టుకుని ఈ 'యేతి'ని గురించిన అద్భుతమైన కథలు చెబుతూ వారిని వినోద పరుస్తారు.

అయితే - 'యేతి' ఎలా ఉంటుందో ఎవ్వరికీ స్పష్టంగా తెలియదు. ఆ వింత జంతువును చూశామని చెప్పే వారే గాని, దాన్ని ఫొటో తీసినవా రెవ్వరూ లేరు. కాని చిత్రంగా శతాబ్దాల తరబడి 'యేతి'ని చూశామని చెప్పిన వారి కథ లన్నీ ఇంచుమించు ఒకే విధంగా ఉంటున్నాయి. శరీరం అంతా పొడుగైన బొచ్చుతో నిండి ఉండే తోక లేని ఒక రకం కోతి 'యేతి'. సాధారణంగా అది జనావాసాల సమీపానికి రాదు. 'మంచు రేఖ' (snow line) కు పైభాగానే అది ఎప్పుడూ కనిపిస్తుంది. దానిని చూసినట్టు చెప్పే వారి కథనాల ప్రకారం దాని ఎత్తు $5\frac{1}{2}$ అ. లకు, 9 అ. లకు మధ్య ఉండవచ్చును.



షెర్పాల భాషలో 'యా' అంటే కొండ, 'తే' అంటే జంతువు. కొండల మీద కని పించే జంతువు అనే అర్థంలో దానిని వారు 'యేతి' అన్నారు. నేపాల్‌లోని మిక్కిలి ఎత్తైన 'మంచు' ప్రాంతంలో నివసించే షెర్పాలకు మేకలూ, తోడేళ్ళూ, మంచు చిరుత పులులూ ఎంత నిజమో ఈ 'యేతి' కూడా అంత నిజం!

'యేతి'ని గురించి పరిశోధనలు సాగించే వారిలో రెండు వర్గాల వారు కనిపిస్తారు. ఒక వర్గం వారు 'అవిశ్వాసులు'. 'యేతి' అడుగు జాడల ఫొటోలు అని మనకు లభించిన వన్నీ నిజానికి మామూలు మంచు కోతి అడుగుల గుర్తులవే అనీ, 'యేతి' అనే వింత జంతువు ఉనికి వట్టి కట్టు కథ అనీ వారి వాదం. రెండో వర్గం వారు అవి మామూలు కోతుల అడుగుజాడ లైతే 9 అం. ల కంటె ఎక్కువ పొడవుగా ఉండ వనీ, 13 అం. ల పొడ వున్న ఈ అడుగు జాడలు నిశ్చయంగా

---

## ఎవరిని ఎక్కడ పొగడాలి?

"మిత్రుణ్ణి అతని పరోక్షంలో పొగుడు:
గురువును సర్వత్ర పొగుడు:
ఆలిని ఏకాంతంలో పొగుడు:
పిల్లల్ని మనస్సులోనే పొగుడు:
పనివారిని పని అయాక పొగుడు:"

—ఒక తమిళ పద్యం

"అంతఃకరణ వెయ్యి మంది సాక్షుల పెట్టు:"

'యేతి'వే అనీ వాదిస్తున్నారు. అవి నిజానికి 9 అం. ల అడుగు జాడలే అయినా ఫొటో తీసేవేళకు మంచు కరిగి 13 అం. ల అడుగు జాడలుగా అవి విస్తరించి కనిపించి ఉండవచ్చు నని దీనికి అవిశ్వాసులు చెప్పే సమాధానం. అయితే - ప్రతి రెండు అడుగు జాడల మధ్య గల దూరం చాలా ఎక్కువగా ఉందనీ, మామూలు కోతి అంగ అంత పెద్దదిగా ఉండ దనీ 'విశ్వాసులు' అంటున్నారు.

1953 లో హిల్లరీ ఎవరెస్ట్ శిఖరం అధిరోహించిన తరువాత పాశ్చాత్య దేశ పత్రికలు 'యేతి' విషయమై ఎక్కు వెక్కువ శ్రద్ధ చూపసాగాయి. లండన్‌లో 'డెయిలీ మెయిల్' యేతిని అన్వేషించి, వీలైతే దానిని బంధించి తీసుకు రమ్మని, ఖర్చులు తాను భరించి ఒక నిపుణుల బృందాన్ని నేపాల్‌కు పంపింది. ఆ బృందం ప్రజలలో ఆసక్తిని రేకెత్తించడంలో కృతకృత్యం అయినా, 'యేతి'ని బంధించడంలో మాత్రం విజయం సాధించలేక పోయింది.

1960 - 1979 మధ్య 'యేతి'ని తాము చూసినట్టు చెప్పే విదేశీయుల కథనాలు మూడు కనిపిస్తున్నాయి. 1960 అక్టోబరులో ఏ. క్రామ్ అనే స్కాట్లండ్ దేశపు మేజిస్ట్రేట్ పశ్చిమ లాహూర్ ప్రాంతంలో 18,000 అడుగుల ఎత్తున తాను 'యేతి'ని చూసినట్టు ప్రకటించాడు. ఆయన ఆ జంతువు తాలూకు అడుగు జాడలకు స్ఫుటమైన ఫొటోలు తీశారు.

1970 లో అన్నపూర్ణ శిఖరారోహణకు బయలుదేరిన బ్రిటిష్ బృందం ఉపనాయకుడు డాన్ విలియమ్స్ కూడా 'యేతి'ని చూసినట్టు చెప్పారు. స్ఫుటంగా వెన్నెల కాస్తూ ఉండగా నాలుగు కాళ్ళమీద నడుస్తూ పోతూన్న ఆ జంతువును తాను చూశా నని ఆయన అన్నారు. అది ఏప్ కోతి లాగే ఉందనీ, ఎలుగు బంటుకీ, ఏప్ కోతికీ పుట్టిన సంకర జాతి జంతువు కావచ్చు ననీ ఆయన భావించారు.

మూడవ సందర్భం - రాయల్ ఎయిర్ ఫోర్స్ పర్వతారోహక బృందానికి చెందిన డా. జాన్ ఎల్లెన్‌కీ, స్క్వాడ్రన్ లీడర్ జాన్ ఎడ్వ్యార్డ్‌కీ 1979 లో ఎవరెస్ట్ శిఖరానికి ఆగ్నేయంగా 20 మైళ్ళ దూరాన హింకూ లోయలో 'యేతి' కనిపించడం. 17,250

(మిగతా 32వ పేజీలో)

## క్రొత్త రకం 'టెక్నోరమా' కెమేరా



మ్యూనిఖ్ (ప. జర్మనీ) లోని 'లిన్ హోప్' అనే ప్రైవేట్ సంస్థ 'టెక్నోరమా' అనే కొత్తరకం కెమేరాను ఉత్పత్తి చేస్తూంది. మొత్తం దృశ్యాన్ని (panorama) అంతటినీ ఫొటో తీయడానికి ఈ కెమెరా ఉపయోగపడుతుంది.

"వంకర వేలుతో ఇతరుల వంక లెన్నకు."

# చేపల వింత అలవాట్లు

## 1

ఎస్. శ్రీనివాస రంగన్



[శ్రీ శ్రీనివాస రంగన్ కేంద్ర సముద్ర మత్స్య పరిశోధన సంస్థ Central Marine Fisheries Research Institute-CMFRI లో 1957 లో కొచ్చిన్‌లో పరిశోధక శాస్త్రవేత్తగా చేరారు. సముద్ర మత్స్యాలను గూర్చి, మంచినీటి సరస్సులలోని మత్స్యాలను గూర్చి పరిశోధించడంలో 25 ఏళ్ళ అనుభవం గడించారు. విస్తృతంగా దేశాటన చేశారు. ఇండియా ఉభయ తీరాలూ ఆయనకు సుపరిచితాలు. అనేక మత్స్య పరిశోధన నౌకా యాత్రలలో ఆయన పాల్గొన్నారు. ప్రస్తుతం మద్రాసు CMFRI లో 'ట్యూనా' చేపను గూర్చిన పరిశోధన ప్రాజెక్టులో పని చేస్తున్నారు.]

చేపలు శీతల రక్తం గల జీవులు. నిత్యం జలంలో ఉండవలసి రావడంతో అందుకు అనుగుణమైన అనేక విచిత్ర విధానాలను అవి అనుసరిస్తాయి. కొన్ని చేపలు సరళంగా కనిపిస్తాయి. కాని కొన్ని నమ్మలేనంత చిత్రంగా ప్రవర్తిస్తాయి. 50 అ.లకు మించిన పొడుగు దాకా ఎదిగే మిక్కిలి పెద్ద చేప వేల్ షార్క్ (Rhincodon) మొదలు పెరుగుదల పూర్తి అయినా 3/4 అం.ల కంటె పొడుగు ఉండని - ఒక ఫిలిప్పీన్ దీవిలోని సరస్సులో కనిపించే-'గోబీ పండకా పిగ్మే' దాకా వివిధ జాతుల చేపలు వ్యాపించడంలో, సంచారంలో, ఆహార సంపాదనలో, సంతతి ఉత్పాదనలో, చిన్నపిల్లల సంరక్షణలో, చివరికి చావులో

### మిక్కిలి బరువైన పెద్ద ఉపగ్రహం

అంతరిక్షంలో మిక్కిలి బరువైన పెద్ద ఉపగ్రహం 'గానిమీడ్' (జూపిటర్ III). మన చంద్రుడి కంటె అది 2.02 రెట్లు ఎక్కువ బరువైంది; దాని వ్యాసం 5,262 కి.మీ. లు. మిక్కిలి చిన్న ఉపగ్రహం 15 కి.మీ. ల కంటె తక్కువ వ్యాసం గల 'లీడా' (జూపిటర్ III).

"వివేకానికి వ్యతిరేక పదం 'అపాయం.'"

కూడా భిన్న భిన్నమైన పద్ధతులను అవలంబిస్తున్నాయి. మనలో చాలా మందికి ఆ అలవాట్లు విచిత్రంగా కనిపించవచ్చును గాని, సముద్రాలలో, నదులలో, సరస్సులలో జీవిత పోరాటంలో ఆ విధమైన పరిసరాల అనుసరణనూ, వింత అలవాట్లనూ పాటించి ఉండకపోతే అవి ఏ నాడో అంతరించి పోయేవి.



ఆహారం అరుదు అవుతూ వెలుతురు మిక్కిలి తక్కువగా ఉండే సముద్రపు లోతు ప్రాంతాలలో బ్రదికే చేపలలో కనిపించే పరిసరానుగుణవర్తన అతి విచిత్రంగాఉంటుంది. వాటి నోళ్ళు చాలా పెద్దవి; నోటికి చిక్కిన ఎర తప్పించుకుపోయే వీలులేకుండా వాటికి నోట్లో చాలా పళ్ళుంటాయి.'మ్రింగుడు గాడు' (The great swallower - Chiasmodon) అనే చేప తనకంటె ఎన్నోరెట్లు ఎక్కువ ప్రమాణం గల చేపలను కూడా గుటుక్కున మ్రింగి వేయగలదు (fig. 1).

చేపల శ్వాస ప్రక్రియ వాటి మొప్పల (gills) ద్వారా జరుగుతుంది. నీటిలో ఉన్న ప్రాణవాయువును ఆ మొప్పల ద్వారా అవి గ్రహిస్తాయి. అయితే సముద్రం లోతు ప్రాంతాలలోని నీటిలో ప్రాణవాయువు భాగం తక్కువగా ఉంటుంది. అందుచేత అక్కడి చేపలు తమ అవసరం కంటె ఎక్కువ ప్రాణవాయువును గ్రహించి తమ దేహంలోని 'గాలి సంచి'లో నిలువ చేసుకుంటాయి.

సంచారం : ఇంచుమించు అన్ని చేపలూ అడ్డంగానే ఈదుతాయి. కాని, నీటిగుర్రం (hippocampus , చిన్న సూదిచేప (centriscidae) మామూలుగా అడ్డంగా పడుకొని కాకుండా నిలువుగా తిరిగి ఈదుతాయి.

ఆఫ్రికాలోని 'పిల్లి-చేప' (synodontis batensoda) లో మరొక చిత్రమైన 'పరిసరానుసరణ' (adaptation) కనిపిస్తుంది. నీటి పైభాగంలో వెల్లకిలా పడుకొని అది ఈదుతుంది (fig. 2). కొన్ని చేపలు ఎగురుతూ ఈదేవి కూడా ఉన్నాయి. ఈ చేపల వర్గం (Exocoetidae నీటినుంచి పైకిఎగసి చాలా దూరం గాలిలో దూసుకుపోయి మళ్ళీ నీటి మీద వాలుతాయి. అలా 1,000 అ. ల కంటె కూడా ఎక్కువ దూరం లంఘిస్తూ అవి గంటకు 40 మైళ్ళ వేగంతో ప్రయాణించగలవు. ఈ విషయంలో గంటకు 30 మైళ్ళు అని అంచనా వేయబడిన ట్యూనా చేప ఈత

---

## మనలో చాలామంది జీవించడం వాయిదా వేస్తున్నారు!

నాకు తెలిసినంతలో మానవ స్వభావంలోని అత్యంత విషాదకరమైన అంశం మనం 'జీవించడాన్ని' వాయిదా వేస్తూ ఉండడం. దిక్చక్రానికి అవల ఎక్కడో ఉన్న వింత గులాబీ తోటను గురించే ఎప్పుడూ కలలు కంటూ మన పెరట్లో మన కిటికీ పక్కన విచ్చిన అందమైన గులాబీని మనం అనుభవించలేక పోతున్నాము. —డేల్ కార్నెజీ

"అపాయం మనిషికి 'దీక్ష'ను అలవరుస్తుంది."

వేగాన్ని కూడా ఇవి అధిగమించ గలవు.

"బురద గిడస" (mud skipper - periopthalmus) కు రొమ్ము మీది రెక్కలు బలపడి అవి నీటి నుంచి వెలువడి ఆహారం కోసం ఇసుకలోనూ, బురదలోనూ



అన్వేషించే టప్పుడు పాదాలుగా వాటికి ఉపయోగిస్తాయి. అన్ని రకాల చేపలలోనూ ఈ ఒక్క రకం చేపకే నీటిలోనూ, నేల మీదా కూడా జీవించగల సౌకర్యాలు ఎక్కువగా ఉన్నాయి.

'ఎగ్రబాకుడు చేప' (Climbing perch - Anabas) చెట్లు ఎక్కగలదు. ఒక సరస్సు నుంచి మరొక సరస్సుకు వలస పోగలదు. 1797 లో డేనిష్ ఈస్టు ఇండియా కంపెనీ తాలూకు డాల్‌డోర్ఫ్ అనే వ్యక్తి 'ట్రాంక్విబార్' (తమిళనాడు) లో ఈ చేప తాటిచెట్టు ఎక్కి, దానిరసం పీల్చడం చూశానని ప్రకటించాడు. కాని, అది నిజం కాదనీ, నేల మీద అది పయనించేటప్పుడు కాకులో, గద్దలో దానిని తీసుకు వెళ్ళి తాటిచెట్టు మీద పెట్టి ఉండవచ్చు ననీ ఆ తరువాతి కాలంలో రుజువైంది. మామూలుగా - గాలి పీల్చే ఈ చేప లన్నిటికీ అనుబంధ శ్వాసావయవాలు ఉంటాయి.

సముద్రపు చేపలలో సాధారణంగా 'వేసవి నిద్ర' కనిపించదు. మంచి నీటి చేపల లోనే కొన్ని రకాల (lung fishes - Dipnoi) లో ఈ అలవాటు కనిపిస్తుంది. 'ప్రోటాప్టెరస్ - అనెక్టెన్స్' అనే చేప నెలల తరబడి నీటి ముఖం చూడకుండా జీవించ గలదు. వేసవి నెలలలో బురదలో ఇది గొట్టం ఆకారంలో ఒక రంధ్రం చేస్తుంది. దీని అట్టడుగు కొస అది అటూ ఇటూ మెసల



CHIASMODON NIGER [GREAT SWALLOWER]

Fig. 1

డానికి వీలుగా కొంత విశాలంగా చేయబడి ఉంటుంది. నీటి మట్టం తగ్గుతూ వస్తున్న కాలంలో ఇది ఆ రంధ్రం అడుగుకి పోయి అక్కడ ఎక్కువ మొత్తంలో జిగురు పదార్థాన్ని విసర్జిస్తుంది. అది గట్టిపడి దాని శరీరం చుట్టూ ఒక పెంకు (cocoon) గా ఏర్పడి, వరపు రోజులలో ఆ కవచం దానిని కాపాడుతుంది.

---

## ప్రపంచంలో దరిద్రుల సంఖ్య

రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ వారి 1983 వార్షిక నివేదిక ప్రకారం ప్రపంచంలోని 470 కోట్ల జనాభాలో 200 కోట్ల మంది దారిద్ర్యంతో అలమటిస్తున్నారు. 45 కోట్ల మందికి కడుపునిండా తిండి లేదు.

"నిప్పుతో చెలగాటా లాడకు."

విషపూరిత మైన చిన్నసైజు బంతి చేప (puffer fish) ఏదైనా ప్రమాదాన్ని పసి గడితే శరీరాన్ని బంతిలాగ ముడుచుకుని సముద్రంమీద శవంలాగ తేలుతూ ఉంటుంది. దాని పొలుసులు నిక్కబొడుచుకుని ఇతర ...లు దానిని కబళించకుండా రక్షిస్తాయి.



CAT FISH [SYNODONT BATENSODA]

Fig. 2

'ఆస్టరీ పైపి' వర్గం చేపలు తమ వర్గం లోని తక్కిన చేపలకు మాత్రమే అర్థం అయ్యే హెచ్చరికలు చేస్తాయి. ఒక సముదాయంలోని ఒక చేప గాయపడితే దాని శరీరంలో నుంచి అది 'హెచ్చరిక' పదార్థాన్ని విసర్జిస్తుంది. అప్పుడా సముదాయం లోని ఇతర చేపలు తమను తాము రక్షించుకోడానికి గాని, పారిపోవడానికి గాని ప్రయత్నిస్తాయి. ఆ హెచ్చరిక పదార్థం ఆ వర్గానికే ప్రత్యేక మైంది. ఆ వర్గం చేపలకే ఆ హెచ్చరిక అర్థం అవుతుంది.

కళ్లు:

మధ్య, దక్షిణ అమెరికాలలోని నదులలో కనిపించే 'అనాబ్లెప్స్' (anableps) అనే చేపలకు కళ్ళు చిత్రంగా ఉంటాయి. ప్రతి కన్ను తల నడిభాగం దాకా వ్యాపించి ఉంటుంది. ఒక నల్లని అడ్డు దారం (band) దానిని రెండు సమ భాగాలుగా విభజిస్తుంది. పై భాగం గాలిలోని వస్తువులను చూడడానికీ, క్రిందిభాగం నీళ్ళలోని వస్తువులను చూడడానికీ




Fig. 3

ఉపయోగపడుతుంది. ఆ విధంగా నీటిపైన పోయే, లేదా గాలిలో ఎగిరే క్రిమి కీటకాలనూ, నీళ్ళ అడుగున ఈదే జీవులనూ కూడా అవి స్పష్టంగా గుర్తించ గలుగుతాయి.

3,000 అ. ల కంటె ఎక్కువ లోతున జీవించే చేపల కళ్ళు చాలా చిన్నవి. కొన్నిటికి నేత్రనాడి ఉన్నా అసలు కళ్ళే ఉండవు. క్యూబాలోని గుహలలో మసలే చేపలలో చాలా రకాలు గుడ్డివి. వాటిలో సుప్రసిద్ధ మైంది: 'లూసిఫ్యూగా స్టిజికోలా'.

బల్లపరుపు చేపల (pleuronectifor-

(మిగతా 38 వ పేజీలో)

## 'వెనీరియల్' అనే పదం వ్యుత్పత్తి

'వీనస్' (శుక్రగ్రహం) నుంచి 'వెనీరియల్' అనే మాట వచ్చింది. ప్రాచీన గ్రీకులకు ప్రేమ, సౌందర్యాల అధిదేవత 'వీనస్'.

# కస్తూరి ఎలుక

డా॥ బి. జి. వి. నరసింహారావు

ఎలుక ఆకారంలో ఉంటూ కస్తూరి పరిమళాన్ని విరజిమ్ముతూ ఉండడం వల్ల 'కస్తూరి ఎలుక' అని దీనికి పేరు వచ్చింది. 'వొండాట్రా జిబిథిక' అని దీని నామం.



'మైక్రోటినే' ఉపకుటుంబానికి చెందిన కస్తూరి ఎలుకలు కెనడా, అమెరికా దేశాలలో ఎక్కువగా కనిపిస్తాయి. సుమారు 1½ అ.ల పొడవుండే ఈ జంతువు 2 మొదలు 3 పౌన్ల దాకా బరు వుంటుంది. దీని తోక పొడవు 10 అం. లు. బీవర్ జంతువు బొచ్చులాగ దీని బొచ్చు మృదువుగా, మెరుస్తూ ఉంటుంది. పై భాగాన జేగురు రంగు గానూ, అడుగున గచ్చకాయ రంగు గానూ ఉంటుంది. దీని వెనుక పాదాలలో కొంత భాగం వల వంటి అల్లిక కలిగి ఉంటుంది. బలమైన తోక, తేలిక అవయవాలూ గల కస్తూరి ఎలుక నీటిలో కూడా యథేచ్ఛగా సంచరించ గలదు.

ఆడ ఎలుక, మగ ఎలుక కలిసి జీవించవు. పిల్లల పెంపకం బాధ్యతలో మగ ఎలుక రవ్వంత కూడా పాలు పంచుకోదు. చూలు కట్టిన నెల రోజులకు ఆడ ఎలుక పిల్లలను పెడుతుంది. తడవకు 4 నుంచి 12 వరకూ పిల్లలను పెడుతూ, ఏటా నాలుగైదు సార్లు ఈనుతుంది. నెల రోజుల వయస్సు వచ్చేసరికల్లా పిల్లలు తమ ఆహారాన్ని తాము సంపాదించుకుంటాయి. 6 నెలలు నిండితే తమ ఇళ్ళను తామే నిర్మించుకుంటాయి. కస్తూరి ఎలుక జీవిత కాలం 10 సం.లు.

కస్తూరి ఎలుకల ఇళ్ళు ఇరుకు గొందెల లాగ ఉంటాయి. తెల్లవారుజాము సమయం లోనూ, సాయంత్రం పూటా నీటిలో ఈదుతూ ఇవి కనిపిస్తాయి. 2 అ.ల కంటె తక్కువ లోతు ఉన్న జలాశయంలో ఇవి

---

## ఇరాన్ - ఇరాక్ యుద్ధంలో ప్రాణ నష్టం

3 ఏళ్ళ క్రితం ఇరాన్, ఇరాక్ దేశాల మధ్య యుద్ధం ఏర్పడింది లగాయతు ఇప్పటి దాకా దాదాపు 5 లక్షల మంది హతులై ఉంటా రని అంచనా!

"బాధలకు భయపడే వాడు
భయంతో బాధ పడుతాడు!"

ఇళ్ళు కట్టుకుంటాయి. నీటి మట్టం వరకూ బంకమన్ను పేర్చి, ఆ పైన 2 మొదలు 4 అడుగుల ఎత్తున గదులు నిర్మించుకుంటాయి. చలికాలం గడపటానికి జలాశయం ఒడ్డున మరో ఇల్లు కూడా కస్తూరి ఎలుకకు ఉంటుంది. శీతా కాలంలో వెచ్చదనం కోసం ఎండు టాకులతోనూ, గడ్డితోనూ తన ఇంటిని అది నింపుకుంటుంది. అది ఇంటిని ఎప్పుడూ శుభ్రంగా ఉంచుకుంటుంది.

నీటి అడుగున లభించే రక రకాల మొక్కలూ, వేళ్ళూ, దుంపలూ దీనికి ప్రధానమైన ఆహారం. నక్కలూ, గుడ్లగూబలూ మొ.వి దీనికి ప్రధాన శత్రువులు. మనుష్యులకు కస్తూరి ఎలుకలపై మమత ఏర్పడటానికి కారణం వాటి చర్మాలు. ఆ చర్మాల మీది బొచ్చుకి రంగువేసి సీల్ చేపల చర్మాల లాగ తయారు చేస్తే వాటికి ఎక్కువ ధర పలుకుతుంది. రంగువేసిన కస్తూరి ఎలుక చర్మాలను 'హడ్సన్ సీల్' అనే వ్యాపార నామంతో విక్రయిస్తున్నారు. ఏటేటా అమెరికాలో 1.2 కోట్ల కస్తూరి ఎలుకలను పడుతున్నట్లు తెలుస్తోంది. లూయీజియానా, మేరీలాండ్‌లు హడ్సన్ సీల్‌లను ఎక్కువగా ఎగుమతి చేస్తున్నాయి.

('బాలజ్యోతి సౌజన్యంతో')

---

(26 వ పేజీ తరువాయి)

అ.ల ఎత్తున 8 × 4 అం.ల కొలతలు గల ఆ జంతువు అడుగుజాడలు వారికి కనిపించాయి. మంచులో అవి 3 అం. ల లోతుగా దిగబడి ఉన్నాయి. ఆ గుర్తుల సమీపంలో మనకు తెలియని ఒక జంతువు విసర్జించిన మలం కూడా కనిపించింది. ఒక శిఖరం అంచు మీద నుంచి వంగి వారు ఆ అడుగు గుర్తులకు ఫోటోలు తీస్తూండగా హఠాత్తుగా వారికి కీచు గొంతుతో పెద్దగా ఒక అరుపు వినిపించింది. అది ఒక స్త్రీ కంఠం లాగ అనిపించింది. ఆ అరుపు విని వారు హడలిపోయి పరుగెత్తారు. ఆ బృందం వెంట ఉన్న షెర్పా పోర్టర్‌లు చీకటిపడ్డాక కొండ శిఖరం మీద తాము ఉండబోమనీ, ఉంటే 'యేతి' వచ్చి తమను కబళిస్తుం దనీ భయపడడంతో ఆ బృందం తిరిగి దిగువ క్యాంపుకు చేరుకోవలసి వచ్చింది.

('ఎంజాయ్ నేపాల్' నుంచి)

---

# ధర్మంతో కూడిన కోపం



" 'కోపం' అందరికీ వస్తుంది—అది తేలికే! కాని కోపించదగిన వ్యక్తి మీద, తగిన సమయంలో, తగినంత పాళంలో, తగిన ప్రయోజన సిద్ధి కోసం, తగు విధంగా కోపపడడం అందరికీ సాధ్యం అయే పని కాదు; అది ఏమంత సులభం అయిన పని కాదు!

—అరిస్టాటిల్

"దూరపు కొండలు నునుపు." — తెలుగు సామెత

# కార్టూనులు గీయటం ఎలా?

టి. వెంకటరావు

## 32
## రచన - 2



Path of the eye







కార్టూన్‌లలో వివిధ భాగాల కూర్పును, లేదా రచనను గురించి మీరు మరి కొన్ని సంగతులు తెలుసుకోవాలి.

ఆసక్తి కేంద్రం (centre of interest): ప్రతి చిత్రంలోనూ చిత్రకారుడు ఒక ఆసక్తి కేంద్రాన్ని సృష్టిస్తాడు. ప్రేక్షకుల కంటిని అతడు ఆ ప్రదేశానికి ఆకర్షిస్తాడు. అదే చిత్రంలో ప్రధాన భాగం అవుతుంది. ఒక పథ కాన్ని అనుసరించి చిత్రంలో వివిధ భాగా లను రచించడం వల్ల ప్రేక్షకుని దృష్టిని అతడు ఆ 'ఆసక్తి కేంద్రం' వైపు ఆకర్షించ గలుగుతాడు. వర్ణ సామరస్యాన్ని (colou

"మనిషి ఆలోచనలూ, చేతలూ - ఇవే
అతని నిజమైన స్వభావం, అతని జీవితం!"

harmony) ని కూడా ఇందుకు వాడు కుంటాడు. తన చిత్రంలో ఆసక్తి కేంద్రంలో మిక్కిలి ఒత్తున రంగు వేయ



డమో లేదా ఆ భాగాన్ని మిక్కిలి ప్రకాశ వంతం చెయ్యడమో చేస్తాడు. సాధారణంగా ప్రేక్షకుని కన్ను ఎప్పుడూ వలయ మార్గంలో (spiral way) ప్రసరిస్తూ ఉంటుంది.



బాలెన్స్ : ప్రతి చిత్రం (panel)లోనూ రెండు ప్రక్కలూ సమానంగా బరువుగా ఉండాలి. రెండు వైపులా రంగు సమానంగా ఉండాలి. ఒక వైపున ఒత్తుగా రంగు వేసి రెండో వైపున తేల్చి వేస్తే ఆ భాగం వెలా తెలా పోతూ ఉంటుంది. అసలు అక్కడ ఏమీ ఉన్నట్టు కనిపించదు. అందుచేత రెండు వైపులా ఒకే విధమైన వర్ణ చిత్రణ ఉండాలి. నిలువుగా ఉన్న చిత్రం అయితే పై భాగం క్రింది భాగంతో బాలెన్స్ కావాలి. అడ్డంగా ఉన్న చిత్రంలో కుడి, ఎడమ భాగాల మధ్య సామరస్యం ఉండాలి. అయితే రెండు వైపులా పూర్తిగా ఒకే విధమైన వర్ణ చిత్రణ కూడా పనికి రాదు. అలా ఉంటే అది కృత్రిమంగా కనిపిస్తుంది. (సశేషం)

## ఇతర గ్రహాలలోని బుద్ధి జీవుల కోసం అన్వేషణ

హార్వర్డ్ యూనివర్సిటీలోని ఓక్‌రిడ్జ్ వేధశాలలోని అమెరికన్ శాస్త్రజ్ఞులు 25 మీ. ల వ్యాసం గల రేడియో టెలిస్కోప్ సహాయంతో మన పాలపుంతలోని ఏ గ్రహం నుంచి అయినా బుద్ధిజీవులు మనకు సందేశాలు పంపుతున్నారేమో అని అంతరిక్షాన్ని గాలించే 4 ఏళ్ళ ఒక బృహత్ పథకాన్ని చేబట్టారు. ఆ టెలిస్కోప్‌కి అనుబంధంగా ఒక సూట్‌కేస్ సైజంత రిసీవరూ, కంప్యూటరూ ఉంటాయి. రేడియోలో వినిపించే విశ్వం హోరు కంటె భిన్నమైన సంకేతాలను అవి తేలికగా గుర్తించగలవు. ఏకకాలంలో 1,28,000 ఛానెల్స్‌ను ఆ రిసీవరులో ట్యూన్ చేయవచ్చును. మన పాలపుంతలోని 300 కోట్ల నక్షత్రాలలోనూ, 200 కోట్ల నక్షత్రాల నుంచి వచ్చే ధ్వని సంకేతాల కోసం ఈ 4 ఏళ్ళలోనూ అన్వేషిస్తారు.

('శాపన్' సౌజన్యంతో)

"మనలో ఎన్ని ఎక్కువ అంశాలకు మనం సిగ్గు పడగలిగితే అంత గౌరవార్హులం అవుతాము." —బెర్నార్డ్ షా

# బహుమతి పొందిన వ్యాసం

## మత సామరస్యం

కాళంగి రాధాకృష్ణ రావు,
తువ్వాచలకరాయుడు పాలెం.

మనిషికీ, మనిషికీ మధ్య మమతనూ, సమతనూ పెంచి అందరి పట్లా సోదర భావాన్ని కలిగించి, భగవద్భక్తిని పోషించి, అంత్య దశలో మోక్షం సమకూర్చేది మతం. అలాంటి మతాన్ని బోధించే వారే నిజమైన మత బోధకులు.

ఒక్కొక్క మతం ఒక్కొక్క రకంగా మోక్షాన్ని పొందవచ్చు నని చెబుతూంది. మధ్వాచార్యులు ద్వైతం బోధిస్తే, దానికి విరుద్ధంగా శంకరాచార్యులు అద్వైతం బోధించారు. కాని రెండింటి ద్వారా లభించే ముక్తి ఒక్కటే. ఎన్ని వందల మతా లున్నా ప్రతి మతం తమ ధర్మం తాము బోధించాలే గాని ఇతర మతాలను విమర్శించరాదు. కబీర్, తానీషా వంటి మహమ్మదీయులు హిందూ మతంలోని ఉత్తమ ధర్మాలను ఆదరించి మత సామరస్య దృష్టిని ప్రదర్శించారు. వివేకానందుడు, గాంధీజీ వంటి మహాత్ములు 'అన్ని మతాలు సామరస్యంతో కలిసి మెలసి జీవించాలి' అని బోధించారు.

## బాలలు చూపిన సాహసం!



తమిళనాడుకు చెందిన 8 ఏళ్ళ వయస్సు గల వాసంతి, మధ్యప్రదేశ్ రాష్ట్రానికి చెందిన 5 ఏళ్ళ తుమన్‌లాల్ సాహూ ధైర్య సాహసాలు ప్రదర్శించే బాల బాలికలకు ఏటేటా ఇచ్చే 'సంజయ్ చోప్రా, గీతా చోప్రా అవార్డులను ఈ ఏడు అందుకున్నారు. జనవరి 24 న మన ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ ఆ అవార్డులను వారికి అందజేశారు. బస్సు వల్ల కలిగిన ఒక ప్రేలుడు ప్రమాదానికి గు[illegible] కాకుండా 5 ఏళ్ళ బాలికను అత్యంత సాహసం ప్రదర్శించి వాసంతి కాపాడింది!

"అన్ని తలుపులూ మూసుకుంటాయి -
ఒక్క మృత్యు ద్వారం తప్ప!"

నేడు ఎక్కడ చూసినా మత కల్లోలాలను హూర్చిన వార్తలు వినవస్తున్నాయి. ఒక వైపున రగ్గులు, గోధుమలు ఎరజూపి, మరొక వైపున సౌదీ అరేబియా నుంచి వస్తున్న పెట్రోలు డాలర్లను విరజిమ్మి అమాయికులైన హిందువులను ఇతర మతాల లోకి ఆకర్షిస్తున్నారు. అట్టి చర్యలవల్ల సంఖ్యా బలం పెరిగినా మతంలోని ప్రధాన ధర్మం దెబ్బ తింటుంది.

* * *

సేయ విజయ, సాలూరు.

హిందూ, బౌద్ధ, క్రైస్తవ, జైనాది మతాల కెన్నిటికో నిలయం భారత దేశం. అన్ని నదులూ చివరికి సముద్రంలోనే కలిసి నట్లు ఏ మతం ఏమి బోధించినా అన్ని మతాల సామ్యం ఒక్కటే! ఎవరి మత ధర్మాలను వారు అనుసరించవచ్చును గాని, ఇతరుల మతాలను కించపరచే అధికారం ఎవరికీ లేదు. అన్ని మతాల పట్ల ఆదరం ప్రదర్శిస్తూ, శాంతి సామరస్యాలతో జీవించడం నాగరకులైన పౌరుల లక్షణం!

కొందరు స్వార్థపరులైన రాజకీయ నాయకులు తెరవెనుక ఉండి అమాయకులైన ప్రజల మధ్య మత కలహాలు సృష్టిస్తున్నారు. మత తత్త్వాన్ని ప్రబోధిస్తున్నారు; రెండు మతాల మధ్య ద్వేషభావాన్ని రెచ్చగొడుతున్నారు. రోజు రోజూ పత్రికలలో ఇలాంటి మత కలహాలను గురించి మనం చదువుతున్నాం.

మత సామరస్యం వేదికల మీద ఎక్కి చేసే ఉపన్యాసాల వల్ల కానీ, విడి వ్యక్తుల వల్ల గానీ సాధ్యం అయేది కాదు. సంఘంలో ప్రతి వ్యక్తీ తన మతాన్ని ప్రేమించడంతో పాటు, ఇతర మతాలను గౌరవించే సభ్యత, సంస్కారం అలవరచుకోవాలి. మన దేశంలో ఇలాగే మత కలహాలు కొనసాగితే ఇప్పటికే

## అగ్ని ప్రమాదం నుంచి బయట పడే ఉపాయం



అనేక అంతస్తులు గల సౌధంలో అగ్ని ప్రమాదంలో చిక్కుకున్నప్పుడు సురక్షితంగా బయట పడే మార్గం ఒక తాడు ఆధారంగా కిటికీ నుంచి క్రిందికి దూకడం! 'సేఫ్ స్కేప్' అనే ఒక అమెరికన్ ఉత్పాదక సంస్థ ఎమెర్జన్సీ కోసం కిటికీల పక్కన అమర్చేందుకు త్రాటితో కూడిన ఒక పరికరాన్ని తయారు చేసింది. 180 కిలోల బరువు వున్న వ్యక్తి ఈ పరికరం సాయంతో సెకనుకు 90 సెం.మీ.ల చొప్పున క్రిందికి జారుతూ సురక్షితంగా భూమి మీద దిగవచ్చు. 40 అంతస్తుల ఎత్తు దాకా ఉన్న భవనాలలో దీనిని వాడుక చేయవచ్చును.

"అతి మంచితనానికి పోకు; అతి తెలివి చూపకు!" —ఓల్డ్ టెస్ట్‌మెంట్

రెండు ముక్కలైన భారత దేశం ఇంకా ఇంకా చీలిపోయే ప్రమాదం ఉంది.

* * *

డి. శేషుబాబు, కైకలూరు.

మతం మానవత్వాన్ని నేర్పే సాధనం. మనిషిలో మానవత్వాన్ని పెంచి, దానవత్వాన్ని నిర్మూలించడం దాని ఆశయం. దేశంలో విభిన్న మతాలు ఉన్నా వాటి మధ్య సరియైన అవగాహన, అనుబంధం ఏర్పడి పరస్పర సహకారంతో జీవించడాన్నే మత సామ రస్యం అంటారు.

మహావీరుడు గానీ, బుద్ధుడు గానీ, క్రీస్తు గానీ ఎవరు చెప్పినా ఒకటే మాట చెప్పారు. ఎదుటి మనిషికి గౌరవం ఇమ్మనీ. తోటి మని షికి వీలైనంత సాయం చేయమనీ వారు బోధించారు. ఆ బోధనలను సరిగా అర్థం చేసుకొని అన్ని మతాల వారూ అన్నదమ్ము ల్లాగ కలసి మెలసి జీవించడం అవసరం. కాని ప్రస్తుత కాలంలో స్వార్థపరుల రాజ కీయ చదరంగంలో పావులుగా మారిపోయిన మతాలు కల్లోలాలకూ, మారణ హోమాలకూ దారి తీస్తున్నాయి. ఇప్పటి పరిస్థితులు చూస్తుంటే 'మతం మానవుల పాలిటి మత్తు మందు' అన్న మార్క్సు మహనీయుని మాటలు నిజమే అనిపిస్తుంది. మత తత్త్వం తల కెక్కిన వారు వివేకం కోల్పోతారు. రైళ్ళు, బస్సులు మొదలైన ప్రభుత్వ ఆస్తు లకు నష్టం కలిగిస్తారు. దేశం అభివృద్ధి పొంది సంపన్నం కావాలంటే ప్రజ లందరూ మత సామరస్యంతో కలిసి మెలసి జీవిం చడం అవసరం!

## ప్రపంచంలో మిక్కిలి సుందరమైన దేవాలయం



మదురైలోని సుందరేశ్వర స్వామి ఆలయమే ప్రపంచం అంతటిలో మిక్కి[illegible] అందంగా తీర్చి దిద్దబడిన ఆలయం. నాలు[illegible] వైపులా సుమారు 1,000 అ.ల పొడవు గ[illegible] ప్రాకారాల మధ్య అనేక మనోహర[illegible] మండపాలూ, ఆలయాలూ, ఉపాలయాల[illegible] నిర్మించబడ్డాయి. ఈ ఆలయానికి మొత్త[illegible] 10 గోపురాలు ఉన్నాయి. ఒక్కొక[illegible] గోపురం సుమారు ఒక 20 అంతస్తుల మే[illegible] అంత ఎత్తుంటుంది. అన్ని గో[illegible] రాల[illegible] ప్లాస్టర్‌తో మలచి మంచి రంగులు వేసి వేలాది శిల్పాలతో అలంకరించబడి, కన్ను[illegible] పండుగ చేసాయి.

"మనం వెళ్ళిపోతున్నట్టు తెలిశాక జనం మన పట్ల చూపే ఆదరం ఆశ్చర్యం కలిగిస్తుంది." —మైకేల్ ఆర్లెన్

విసుదలో ·

(30 వ పేజీ తరువాయి)

mes) లో చిత్రమైన కళ్ళ ఏర్పాటు కనిపిస్తుంది. బాగా చిన్నపిల్లలు (larva) గా ఉన్నప్పుడు అన్ని చేపలలాగే వాటికీ తలకు రెండువైపులా రెండు కళ్ళుంటాయి. కాని క్రమంగా పెరిగిన కొద్దీ వాటిలో ఒక కన్ను తలమీది భాగానికి పోయి పోయి, రెండవ కంటికి పై భాగానికి చేరుతుంది.

కాంతి ప్రసారం:

కొన్ని చేపలు తమలో కాంతిమంత మైన అవయవం ఏదీ లేకుండానే కాంతిని ప్రసరి ాయి. ప్రకాశవంత మైన సూ లు bacteria) వాటి దేహంలో ఉండడం ఇందుకు కారణం. 'ఎలుక తోక' చేప (Rat tail-Malacocephalus laevis) ఆసనం దగ్గర ఒక సంకీర్ణ మైన గ్రంధి ఉంటుంది. దానిలో ఈ సూక్ష్మజీవులు చేరుతాయి.

హిందూ మహా సముద్రంలో ఎక్కువగా నిపించే 'అనమలోప్స్' (anamalops) నే చేపకు కంటికి దిగువ భాగాన ఇలాంటి సంకీర్ణావయవం ఉంటుంది. దానికి ఒకమూత flap కూడా ఉండి, వెలుతురు అవసరం లేనప్పుడు ఆ మూత ఆ అవయవాన్ని ప్పివేస్తుంది. 'జాలరి చేపల' (angler shes) రకాలలో ఎర (bait) ప్రకాశ ంతంగా ఉండడం వల్ల దాని నోటికి చేరు గా వచ్చే చిన్న చేపలను అది ఆకర్షిస్తుంది.

విద్యుత్ అవయవాలు (electric rgans) : సుమారు 250 రకాల చేపలకు ద్యుచ్ఛక్తిని ప్రసరించే అవయవాలు న్నాయి. వాటిలో కొన్ని: 'విద్యుత్ కిరణం (electric ray - Narcine), 'విద్యుత్ ఈల్' (electrophorus), 'విద్యుత్ పిల్లి చేప' (malapterurus).

'విద్యుత్ కిరణం' లో ధనధ్రువం చేప పై భాగాన, ఋణధ్రువం క్రింది భాగాన ఉంటాయి. వివిధ రకాల చేపలు ప్రసరించే విద్యుచ్ఛక్తిని లెక్కలు కట్టారు. 'కిరణం' (Ray) 4 వోల్టుల శక్తినీ, 'టార్పెడో' 40 వోల్టుల శక్తినీ, 'విద్యుత్ ఈల్' 370 మొదలు 550 వోల్టుల దాకానూ, 'విద్యుత్ పిల్లి చేప' 350 మొదలు 450 వోల్టుల దాకానూ విద్యుత్తును ప్రసరిస్తుంది. వాటి

## స్టీల్ కొవ్వొత్తులు



మన భోజన శాలలలోనూ, పడక గదుల లోనూ ప్రస్తుతం మనం వాడే కొవ్వొత్తులు ఎక్కువసేపు వెలుగవు; పైగా కరిగిన మైనం పెమ్మెల మీద పోగు పడుతుంది. ఇలాంటి బాధ లేకుండా డెన్మార్క్‌లో ఇప్పుడు వేరు వేరు సైజుల్లో స్టీల్ కొవ్వొత్తులు తయారు చేస్తున్నారు. నూనె, వత్తి అమర్చిన ఈ కొవ్వొత్తులు (candles) గంటల తరబడి వెలుగుతాయి.

"శిథిలం అయిన మనస్సుకు నిదర్శనం భయం." —వర్జిల్

ఎరకు ఎలెక్ట్రిక్ షాక్ కలిగించి, వాటిని ఆరగించడానికి ఈ విద్యుచ్ఛక్తిని అవి విని యోగిస్తాయి.

సంఘ జీవనం (commensalism):

చిన్న జీవులను ఆరగిస్తూ పెద్దజీవులచేత కబళించబడకుండా తమను తాము రక్షించు కునేందుకు కొన్ని చేపలు బృందాలుగా ఏర్పడు తాయి. ఇలాంటి వాటికి చక్కని ఉదాహరణ: పొమాసెంట్రిడ్ చేపలు. ఆనిమోన్‌లు అన బడే పెద్దసైజు చేపలతో ఇవి జత కడతాయి.

సంఘ జీవనానికి మరో ఉదాహరణ: 'ఈల్' ఆకారంలో ఉండే 'కారపస్' (carapus) చేప. ఇది 'హాలోతురియన్'లు అన బడే సముద్ర జీవులతో జట్టుకట్టి వాటి శరీరా లలో దాక్కుంటాయి (fig. 3). ఈ 'హాలో తూరియన్' దేహంలో ప్రవేశించేటప్పుడు ఈ చేప ముందుగా తలను దాని ఆసనంలోకి చొనిపి తోకను గుండ్రంగా చుట్టి లోపలికి లాక్కుని ఆ తరువాత మళ్ళీ నిటారుగా సద్దు కుంటుంది. ఏక కాలంలో చాలా చేపలు ఈ 'హాలోతూరియన్' దేహంలో దాక్కోగలవు.

బ్రెజిల్ (ద. అమెరికా) లోని 'కాండిరూ' (vandellia) అనే చిన్నసైజు చేపకు నదు లలో స్నానాలు చేస్తున్న మనుష్యుల మూత్ర నాళం (urethra) లోకి ప్రవేశించే పాడు అలవాటు ఉంది. ఈతలు కొట్టేవారు విడిచే మూత్రం వాసన దానిని ఆకర్షిస్తుంది. ముఖ్యంగా మూత్ర విసర్జన చేసే సమయంలో అది మూత్రనాళంలోకి చొరబడుతుంది. అలా ఆ చేప జొరబడిన ఈతగాళ్ళు వెంటనే ఆప రేషన్ చేయించుకుని దాని పీడ వదుల్చుకుంటే తప్ప, లేకపోతే అది మూత్రాశయానికి ముప్పు కలిగించి, ఒక్కొక్కప్పుడు ప్రాణం మీదికి కూడా తేవచ్చును. ఆపరేషన్ ద్వారా దానిని తీసివేయాలే గాని, బలవంతాన బయటికి లాగా లని ప్రయత్నిస్తే నిక్కపొడుచుకొని ఉన్న దాని పొలుసు ముల్లు మూత్ర నాళాన్ని చీల్చి వేస్తుంది.

మీసాలు (Sensory organs):

చాలా రకాల చేపలకు 1 మొదలు 8 దాకా

(మిగతా 40 వ పేజీలో)

## ప్రాచీన నాణేల పరిశోధన సంస్థ



'ప్రాచీన నాణేల విజ్ఞానా' (numismatology) నికి సంబంధించిన పరిశోధన సాగించేందుకు ప్రపంచంలో ఏకైక సంస్థ మహారాష్ట్రలోని నాసిక్ సమీపంలో స్థాపించ బడింది. పరిశోధనకు కావలసిన వివిధ సౌక ర్యాలతో పాటు, ప్రపంచంలోని వివిధ జాతు లకు చెంది నసుమారు 50,000 అపురూపపు నాణేల ఫొటోగ్రాఫ్‌లూ, ఒక స్టూడియో, లోహ పరిశోధన లేబరేటరీ, ప్రాచీన నాణేల మ్యూజియమ్ కూడా ఇక్కడ ఏర్పాటుచేశారు.

"కాలక్షేపం రాయుళ్ళు ఎక్కడ పడితే అక్కడే దొరుకుతారు." —రవీంద్రనాథ్ ఠాకూర్

# ఇండియాలో టెలిఫోన్‌ల కథ

1876 లో టెలిఫోన్ కనిపెట్టబడిన తరువాత కేవలం 6 ఏళ్ళలోనే 1882 జనవరి 28 వ తేదీన ఇండియాలో టెలిఫోన్



వెలసింది. మద్రాసులో 40 లైన్‌లూ, బొంబాయిలో ఒక 80 లైన్‌ల ఎక్స్ఛేంజ్, కలకత్తాలో ఒక 50 లైన్‌ల ఎక్స్ఛేంజ్ ఆ నాడు పని చేయడం మొదలుపెట్టాయి.

ఇవాళ ప్రపంచంలో టెలిఫోన్ సౌకర్యాలు విపరీతంగా పెరిగిపోయాయి. దాదాపు 48 కోట్ల టెలిఫోన్ లైన్‌ల మీద సుమారు 180 కోట్ల సంభాషణలు రోజూ ప్రసారం అవుతున్నాయి. అయినా – ఇండియాలో టెలిఫోన్‌లు ఇంకా తగినంతగా అభివృద్ధి పొందలేదు.

1947 ఆగస్టు 15 న మనకు స్వరాజ్యం వచ్చే నాటికి ఇండియాలో కేవలం 82,000 టెలిఫోన్ లైన్‌లూ, 320 ఎక్స్ఛేంజ్‌లూ మాత్రమే పని చేస్తూ ఉండేవి. బ్రిటిష్ ప్రభుత్వం ప్రజల అవసరాలను పరిగణనలోకి తీసుకోలేదు. కేవలం ప్రభుత్వ పరిపాలనా, రక్షణ వ్యవస్థల అవసరాలను మాత్రమే దృష్టిలో ఉంచుకొని ఆ రోజులలో టెలిఫోన్ వ్యవస్థ నిర్వహించబడింది.

ఇండియాకు స్వరాజ్యం వచ్చిన తరువాత 1948 లో 'ది ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీ' అనే ఫ్యాక్టరీని స్థాపించి టెలిఫోన్‌లకు అవసరమైన సామగ్రినీ, పరికరాలనూ ఉత్పత్తి చేయడం ప్రారంభించారు. గత 34 ఏళ్ళలో సాధించిన అభివృద్ధి ఫలితంగా ప్రస్తుతం మన దేశంలో 25 లక్షల టెలిఫోన్ లైన్‌లూ, 8,000 ఎక్స్ఛేంజ్‌లూ పని చేస్తున్నాయి. ●

---

(39 వ పేజీ తరువాయి)

సన్నని దారాల లాంటి మీసాలు దాని మూతి చుట్టూ ఉంటాయి. వీటిని అనుబంధ జిహ్వాలు (axillary tongues) అంటారు. కొన్ని చేపలలో ఇవి చెట్ల కొమ్మలలాగ శాఖోపశాఖలుగా చీలి ఉంటాయి. ఆహారాన్నీ, నెలవునూ అన్వేషించడంలో ఇవి వాటికి తోడ్పడుతాయి. షార్క్ చేపలు వాటి 'ఎర' వాసన వల్ల, ముఖ్యంగా రక్తపు వాసనవల్ల ఆకర్షించబడుతాయి.

'చిలుక-చేప' (scarids) వంటి కొన్ని రకాలలో పళ్ళు చిలుక ముక్కులాగ వంపు ఉంటాయి. పగడపు దీవుల పరిసరాలలోని ఎంత గట్టి వస్తువులనైనా పగులగొట్టగలిగినంత బలంగా ఈ చేపల పళ్ళు ఉంటాయి. (సశేషం)

"తను మనసారా ప్రేమించే స్త్రీని ఏ పురుషుడూ పొగడడు." —టకెర్మన్

## ప్రముఖులతో విజడమ్

# "సంతృప్తిలోనే సంతోషం ఉంది!"

(తమిళనాడు మాజీ ముఖ్య మంత్రి శ్రీ ఎమ్. భక్తవత్సలం 'విస్‌డమ్'కు ప్రత్యేకంగా ఇచ్చిన ఇంటర్వ్యూ)



(భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాలొన్న స్వాతంత్ర్య యోధులలో శ్రీ భక్తవత్సలం ఒకరు. స్వరాజ్యం రాక ముందూ, వచ్చిన తరువాతా కూడా అనేక ఉన్నత పదవీ బాధ్యతలను ఆయన నిర్వహించారు. అంతరాత్మ శుద్ధి కలిగి, పరిపాలనలో సమర్థతకీ, నిజాయితీకి ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చిన కొద్ది మంది మంత్రులలో ఆయన ఒకరు. 1964 మొదలు 1967 దాకా తమిళనాడు రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో శక్తి వంచన లేకుండా ఆ రాష్ట్ర సర్వతో ముఖాభివృద్ధికి ఆయన కృషి చేశారు.)

* తమిళనాడు చరిత్రలో చిరస్మరణీయమైన స్థానాన్ని మీరు ఎలా సాధించగలిగారు?

రాజకీయ నాయకులు ఎక్కువ మంది పుట్టిన కుటుంబంలో పుట్టి పూర్తిగా రాజకీయ వాతావరణంలోనే నేను పెరిగాను. మా పినతండ్రి (uncle) ముత్తురంగ ముదలియార్ దక్షిణ భారతదేశంలోని ప్రముఖ స్వాతంత్ర్య యోధులలో ఒకరు. చాలా చిన్నతనంలోనే నేను కాంగ్రెస్‌లో చేరాను.

---

## హిమాలయాలను అధిరోహించిన తొలి కొరియన్ మహిళ

హ్యోవుంగ్ హీకే అనే కొరియన్ స్త్రీ నేపాల్‌లోని 6,986 మీ. ల ఎత్తున్న 'మౌంట్ లంజుంగ్ హిమల్' అనే హిమాలయ శిఖరం అధిరోహించింది. ఆవిడే ఈ ఘనకార్యం సాధించిన తొలికొరియన్ మహిళ!

"నా జోక్‌లలో రహస్యం: ఉన్న నిజం చెప్పడం!
ప్రపంచంలో ఇంత కంటె గొప్ప జోక్ మరోటి ఉండదు." —బెర్నార్డ్ షా

'లా' డిగ్రీ తీసుకున్నా లాయరుగా ఎన్నడూ ప్రాక్టీస్ చేయలేదు. అన్ని ప్రధాన స్వాతంత్ర్య ఉద్యమాలలోనూ నేను పాల్గొన్నాను. దేశం కోసం మూడు సార్లు జైలు శిక్ష అనుభవించాను. బయట ఉన్న కాలంలో గాంధీగారి నిర్మాణాత్మక కార్యక్రమంలో పాల్గొనే వాణ్ణి. స్వరాజ్యం వచ్చినప్పటినుంచీ సుమారు 20 ఏళ్ళపాటు వివిధ మంత్రి వర్గాలలో నేను మంత్రిగా పని చేశాను. రాజకీయాలలో నా విజయానికి కీలకం నా 'లోక జ్ఞానం' కావచ్చు.

* * *

* మీ జీవితంలో మరపురాని క్షణం ఏది?

కాంగ్రెస్‌లో చేరి వ్యక్తిగతమైన సుఖాల కోసం చూసుకోకుండా, మా సర్వస్వం అర్పించి దేశం కోసం బ్రిటిష్‌వారితో పోరాడాము. మా జీవిత కాలంలోనే మా ఆశయం ఫలించి స్వరాజ్యం వచ్చింది. బహుశః అదే నా జీవితంలో మరపు రాని మధురక్షణం అనుకుంటాను.

* ఇంత వృద్ధాప్యంలో కూడా ఇంత ఉత్సాహంగా ఎలా ఉండగలుగుతున్నారు?

ఇప్పుడు నాకు 86 ఏళ్ళు. నా ఆరోగ్యం శుభ్రంగా ఉంది. ఎప్పుడూ నేను ఉల్లాసంగా ఉండడానికి కారణం—బలమైన ఆహారం నేను తీసుకోను. నేను పూర్తిగా శాకాహారిని. ఇడ్లీ, అన్నం, సాంబారు, మజ్జిగ, తాజా కూరలు, పళ్ళు—ఇవే నా ఆహారం. ఉన్న దానితో ఎప్పుడూ తృప్తి పడతాను. సంతృప్తి లోనే సంతోషం ఉంది.

* * *

* మీ జీవితం మీద ప్రభావం చూపించిన రచయితలను కొందరిని చెబుతారా?

'సిలప్పదికారం' వ్రాసిన తమిళకవి పుగళేంది, కొందరు ఆళ్వారలు (శ్రీ వైష్ణవా

## మెల్లగా నడిచే పిల్లలు చురుకుగా నేర్చుకో లేరా?



పిల్లలలో మెల్లగా నడిచే అలవాటున్న వారికి చురుకుగా చదువు వచ్చే అవకాశాలు తక్కువని న్యూజీలాండ్‌లోని ఒటాగో వైద్య కళాశాల తాలూకు ఫిల్ సిల్వా, రాబ్ మెక్‌గీ, షీలా విలియమ్స్ అంటున్నారు. 7 ఏళ్ళ వయస్సు గల 954 మంది పిల్లలతో సుదీర్ఘ కాలం వారు కొనసాగించిన పరిశోధనల వల్ల నడకలో గాని, మాటలో గాని, రెంటిలో గాని, చురుకుదనం లోపించిన పిల్లల ఐ.క్యూ. తక్కువగా ఉంటుం దని రుజువైంది.

"చదవడంలో నేర్పు అనవసరపు ఘట్టాలను అతి మెలకువతో దాటివేయడం!" —పి. జె. హామర్‌టన్

చార్యులు) అంటే నాకు చాలా ఇష్టం. స్కూల్లో నాకు తమిళం నేర్పిన మాష్టారు శ్రీ యు. వి. స్వామినాథయ్యర్‌కి ప్రత్యక్ష శిష్యులు. ఆయన తమిళసాహిత్యం మీద నాకు ఇష్టం కలిగించారు. కాలేజ్‌కి వచ్చాక ఎడిసన్, మిల్టన్, బైరన్, షేక్స్‌పియర్ ఎక్కువగా చదివేవాణ్ణి. నా జీవన పథాన్ని మలచడంలో వారందరి ప్రభావం కొంత కొంత ఉండి ఉండవచ్చు.

* * *

* నిరాడంబరంగా జీవించడం, ఉదాత్తంగా ఆలోచించడం దీనిని సాధించే కచ్చితమైన మార్గం ఏది?

మహాత్మా గాంధీకి ఈ విషయంలో గట్టి నమ్మకం ఉండేది. దీనిని సాధించడానికి మనం కాలేజీలో చదువ నక్కరలేదు. ఎవరి మట్టుకు వారు స్వ ప్రయత్నంతోనే దానిని సాధించాలి. మంచివారి సాంగత్యం — సత్‌సంగం — ఇందుకు దోహదం చేస్తుంది. పరిస్థితులు కలిసివస్తే పొంగిపోవడం, ప్రతికూలిస్తే క్రుంగిపోవడం — రెండూ పనికి రాదు.

* * *

* మన బాబాలు ప్రదర్శించే మహిమలలో మీకు నమ్మకం ఉందా?

ఆ విషయమై నేను తీవ్రంగా పరిశీలించలేదు. కాని, వెనుకటి రోజులలో మహాత్ములు మహిమలు ప్రదర్శించారు. ఏసుక్రీస్తు ఎన్నో మహిమలు చూపాడు.

* 'భయం' నుంచీ, 'ఆందోళన' నుంచీ విముక్తి సాధించడం ఎలా?

## తోడేలు పెంచిన బాలికలు



1920 అక్టోబరు నెలలో మిడ్నాపూ
(ప.బెంగాల్) లోని ఒక కొండ గుహను
తవ్వినప్పుడు దానిలో రెండు తోడేళ
పిల్లలూ, ఆ పిల్లలతో పాటు పెరుగుతున్న
ఇద్దరు మానవ బాలికలూ కనిపించారు. తిరిగి
మానవ బాలికలుగా వారిని తీర్చి దిద్దడాని
మిడ్నపూర్ అనాథాశ్రమం నిర్వాహకులు రెవ
రెండ్ జె.ఎల్. సింగ్‌కు వారిని వప్పజెప్పారు
వాళ్ళ జుట్టు అట్టకట్టుకుపోయింది. పళ్లూ
కోరలూ అతి వాడిగా ఉన్నాయి. చేతుల
క్రింద ఆన్చి తోడేలు పిల్లలలాగే నడుస్తు
న్నారు. ఒక ఏడాది అనంతరం 'అమల' అనే
చిన్న పిల్ల చనిపోయింది. 9 ఏళ్ళు పెరి
జంతు లక్షణా లన్నీ పోయి, తోటి పిల్లలతో
ఆడుకునే స్థితికి వచ్చిన తరువాత 'కమల'
అనే పెద్దపిల్ల కూడా 1929 నవంబరు 14
చనిపోయింది.

"మనలో 'చెడు' నశిస్తే, దానిని పారదోలిన ఘనత మనదే అనివిఱ్ఱవీగుతాము." —లారో చెఫౌకాల్డ్

ధైర్యంగా వాటిని ఎదుర్కోడం వల్లనే వాటిని మనం అధిగమించగలం. జీవితంలో పిరికితనం పనికిరాదు.

్మ'లో మీకు నమ్మకం ఉందా?

ఆత్మ నిత్యం, శరీరం క్షణ భంగురం అని చెప్పే వారితో నేను ఏకీభవిస్తాను. బహుశః పునర్జన్మ ఉండవచ్చు. లేకపోతే కొంతమంది పిల్లలు మరీ చిన్న వయస్సులోనే అసాధారణ ప్రతిభ ప్రదర్శించడం ఎలా సంభవం? అనుస్యూతంగా ఆత్మ వస్తూ ఉండి ఉండాలి — జననం, మరణం ఒక దాని వెంట ఒకటి సంభవిస్తాయి.

* * *

* 'విస్డమ్' పాఠకులకు మీరేదైనా సందేశం ఇస్తారా?

భాషా, ప్రాంతీయ, కుల దురభిమానాలను మాని, మన మతం, సంస్కృతి బోధించే ప్రధాన సూత్రాలను పాటించండి. జన సామాన్యం పట్ల ఆదరం ప్రదర్శించండి. దారిద్ర్యంతో ఎవ్వరూ బాధపడకూడదు. మనుష్యులందరూ సోదరులనీ, అందరికీ సమానంగానే దేవుడు తండ్రి అనీ, మతాలు బోధించే ప్రధాన సూత్రాలు ఒకటే అనీ గుర్తించండి. వివిధ మతాల మధ్య పరస్పర అవిశ్వాసానికీ, శత్రుత్వానికీ స్వస్తి చెప్పండి.

## రాగి పాత్రల వాడకం వల్ల కలిగే హాని!

ఇండియన్ 'పీడియాట్రిక్స్' అనే పత్రికలో ప్రచురింపబడిన ఒక నివేదిక ప్రకారం ఎక్కువ కాలం వంటకు రాగి పాత్రలను వాడడం వల్ల 'కాలేయం వాపు' వ్యాధి సంభవించే అవకాశాలున్నాయి. ఇండియాలో చాలా మంది ఇంకా వంటకు రాగి పాత్రలు వాడుతున్నా, ఇతర దేశాలలో ఎవ్వరూ వంటకూ, ఆహార పదార్థాల నిలువకూ రాగి పాత్రలను వాడడం లేదు.

## విదేశీ మారకం సంపాదనలో రెండో స్థానం వజ్రాలది!



1975-76 లో రూ. 100 కోట్ల విలువ గల వజ్రాలను ఇండియా ఎగుమతి చేయగా 1982-83 నాటికి ఆ ఎగుమతుల విలువ రూ. 913 కోట్లకు పెరిగింది. ఇండియా చేసే ఎగుమతులలో వజ్రాలు ద్వితీయస్థానం ఆక్రమిస్తున్నాయి. 1982-83 లో వాటి వల్ల లభించిన నికర విదేశీ మారకం రూ. 249 కోట్లు.

"అకారణ ద్వేషాలు వదులుకోడానికి ముహూర్తం మించిపోవడం అంటూ లేదు." —థోరో

# వారిని గురించి తెలుసుకోండి

పెర్ల్ ఎస్. బక్: సుప్రసిద్ధ అమెరికన్ నవలా రచయిత్రి. చైనావారి జీవితాన్ని గురించి ఆమె వ్రాసిన నవలలకు చైనా రచ



యితలు తమ జీవితాలను చిత్రిస్తూ వ్రాసిన నవలలకంటె కూడా ఎక్కువ ప్రశస్తి వచ్చింది. 'గుడ్ ఎర్త్' అనే నవల ఆమె రచనలలో సుప్రసిద్ధమైంది. 1938లో సాహిత్యానికి ఇచ్చే నోబెల్ బహుమతిని ఆమె అందుకుంది. ఆర్. కె. నారాయణ్ వ్రాసిన 'ది గైడ్' అనే నవల ఫిలింగా తీసినప్పుడు దాని చలనచిత్ర కథను ఆమె వ్రాసింది.

*　*　*

గ్రెగరీ పెక్: అ. 6 ల, అం. 3 ల ఎత్తు గల భారీ విగ్రహంతో మూడు దశాబ్దాల పాటు హాలీవుడ్ చలన చిత్రాలలో హీరోగా వెలిగినవాడు. 'రోమన్ హాలీడే', 'స్పెల్ బౌండ్', 'డ్యూయెల్ ఇన్ ది సన్', '[illegible] గన్స్ ఆఫ్ నవరోనె', 'ది ఓమెన్' వం[illegible] చిత్రాలలో ఆయన ప్రదర్శించిన నట[illegible] కౌశలం అత్యద్భుతం!

హర్ గోబిందు ఖొరానా: అమెరికన్ పౌ[illegible] సత్వం పొందిన భారతీయ శాస్త్రవేత్త[illegible] అను వంశిక లక్షణాలను (genetic code[illegible] గురించి ఆయన స్వతంత్రంగా పరిశోధన[illegible] చేశారు. 1968 శరీర శాస్త్రంలో, లేదా వై[illegible]

## మనం - ఇతరులు

"ఇతరులు ఏదైనా పని మెల్లగా చే[illegible] వాళ్ళు వట్టి 'మందకొడి' మనుష్యులు! అ[illegible] మనం అయితే ఏ పని అయినా 'నిదానంగా 'ప్రశస్తంగా' చేసేవాళ్ళం! ఇతరులు ఎగగొడితే వారు వట్టి సోమరిపోతులు! మనం అయితే క్షణం తీరిక లేని వాళ్ళ[illegible] ఇతరులు ఎవరూ చెప్పకుండానే ఒక[illegible] చేస్తే 'హద్దుమీరి వర్తించేవాళ్ళు!' మనం అయితే 'చొరవ' (initiative) కొని పని చేసేవాళ్ళం! ఇతరులు తమ ప్రాయం గట్టిగా చెబితే వారు 'మొ[illegible] పోతులు!' అదే మనం అయితే—'దృఢ[illegible] భావాలు' ఉన్నవాళ్ళం!"

(టామ్ నైట్ - 'రీడర్స్ డైజెస్ట్' సౌజన్యం

"దేశానికి ఎక్కువ సేవ చేసేవాడే తన పార్టీకి ఎక్కువ సేవ చేస్తాడు!" —రూథర్‌ఫర్డ్ బి. హేస్

శాస్త్రంలో నోబెల్ బహుమతి ఖొరానా, నీరెన్‌బెర్గ్, ఆర్. డబ్ల్యు. హోలీలకు ఉమ్మడిగా ఇచ్చారు.

* * *

రవి శంకర్: ఈ ఇరవయ్యో శతాబ్దిలోని మహా గాయకులలో ఒకరు. మైహర్‌కు చెందిన ఉస్తాద్ అల్లావుద్దీన్ ఖాన్ వద్ద ఆయన సితార్ వాయించడం నేర్చుకున్నారు. విదేశీ చిత్రాలకు సంగీత దర్శకత్వం నిర్వహించిన తొలి భారతీయ సంగీత విద్వాంసుడు అయనే: 'బుక్ ఆఫ్ మ్యూజిక్ మెమరీ', 'మై మ్యూజిక్, మై లైఫ్' అనే రెండు గ్రంథాలు కూడా ఆయన వ్రాశారు.

* * *

డా॥ వి. కే. ఆర్. వి. రావు: ఉపాధ్యాయుడు, పరిశోధకుడు, ఆర్థిక విషయాల శలహాదారు, పరిపాలన దక్షుడు, విద్యావేత్త, రాజకీయవేత్త – ఈ అందరి అంశలూ తగిన పాళ్ళలో కలసి ఏర్పడిన ఒక విశిష్ట వ్యక్తి. 'జాతీ యాదాయం' అనే విషయం మీద పరిశోధన చేసి, కేంబ్రిడ్జ్ విశ్వ విద్యాలయం నుంచి ఆయన పీహెచ్. డి. పట్టం పొందారు. విశ్వవిద్యాల యోపాధ్యక్షుడుగా, భారత కేంద్ర ప్రభుత్వ మంత్రిగా పని చేశారు. 'ఎస్సేస్ ఇన్ ఎకనామిక్ డెవలప్‌మెంట్', వాల్యూస్ అండ్ డెవలప్‌మెంట్ – ఇండియన్ ఛాలెంజ్', 'ఎడ్యుకేషన్ అండ్ హ్యూమన్ రిసోర్స్ డెవలప్‌మెంట్', నెహ్రూ లీగసీ' వంటి పలు గ్రంథాలు రచించారు.

జనరల్ గోపాల్ గురునాథ్ బేవూర్: మాజీ భారత సర్వసేనాని. రెండవ ప్రపంచ సంగ్రామకాలంలో బర్మా రంగంలో పని చేశారు. 1969 లో 'పరమ విశిష్ట సేవా మెడల్' అందుకున్నారు. 1971 లో పాకిస్తాన్‌లో జరిగిన యుద్ధం అనంతరం 1972లో భారత రాష్ట్రపతి 'పద్మభూషణ్' బిరుదు ఇచ్చి ఆయనను సత్కరించారు. క్రీడలపట్ల ఆయనకు ఆసక్తి హెచ్చు. ●

## మిక్కిలి బరువైన చక్రవర్తి



ప్రపంచంలో మిక్కిలి బరువైన చక్రవర్తి ద. పసిఫిక్ మహా సముద్రంలోని 'టాంగా' దేశపు 'టేపా అహా ట్యుపో IV' ఇటీవల 3 రోజుల పాటు బ్రిటన్ సందర్శించారు. ఆయన బరువు 209.5 కిలోలు (460 పౌన్లు); ఎత్తు 1.9 మీ.లు (అ. 6.ల, అం. 3 లు). ఛార్లెస్ రాకుమారుని వివాహానికి వచ్చినప్పుడు ఆయన కోసం ప్రత్యేకంగా తయారుచేయించిన కుర్చీలోనే ఈ సారి కూడా ఆయన కూర్చున్నారు.

"ప్రతి విప్లవం ఆదిలో ఒక వ్యక్తి బుర్రలో తోచే ఆలోచనగానే ఆరంభం అవుతుంది." —ఎమర్సన్

# నిజాలు - నిదర్శనాలు

## 'బాటా' పాదరక్షల ఉత్పత్తి తగ్గుదల:

1981 లో 1,32,08,000 జతల తోలు పాదరక్షలను ఉత్పత్తిచేసిన 'బాటా ఇండియా లిమిటెడ్' 1982 లో 1,17,73,000 జతలు మాత్రమే ఉత్పత్తి చేసింది. రబ్బరు, కేన్వాస్ పాదరక్షలు 3,07,09,000 జతలను 1981 లో ఉత్పత్తి చేయగా, 1982లో ఆ ఉత్పత్తి 2,69,79,000 జతలకు పడిపోయింది. ఈ తగ్గుదలకు కారణం-కార్మికులలో అసంతృప్తి, అలజడీ అంటున్నారు.

* * *

## పురుటిలో ధనుర్వాతంవల్ల శిశు మరణాలు:

ఇండియాలో శిశుమరణాలకు ప్రధాన కారణాలలో ఒకటి పురుటిలో వచ్చే ధనుర్వాతం (tetanus). ఒక్క ఉత్తర ప్రదేశ్ లోనే పుట్టిన ప్రతి 1,000 మంది శిశువులలో 67 మంది ఈ వ్యాధికి బలి అవుతున్నారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ జరిపిన సర్వేవల్ల పట్టణప్రాంతాలలోని శిశువులలో 16 మొదలు 72 శాతం దాకానూ, గ్రామీణ ప్రాంతాలలో '0' మొదలు 59 శాతం దాకానూ ఈ వ్యాధి వల్ల మరణిస్తున్నట్టు తెలుస్తూంది.

## బొంబాయిరేవునుంచి 2.5 కోట్ల టన్నుల సరుకు రవాణా:

1982-83 సం.రంలో బొంబాయి రేవు నుంచి 2.5 కోట్ల టన్నుల రవాణా జరిగింది. మన దేశంలో అన్ని రేవులలోనూ జరిగే మొత్తం రవాణా 9.61 కోట్ల టన్నులు. ఇండియాలో మొత్తం రేవు లన్నీ సుమారు

## ప్రపంచంలో అడవుల అంతర్ధానం



సాలుకు 2,50,000 చ.కి.మీ. ల మేర ఉన్న చెట్ల చొప్పున ప్రపంచం అంతటా అడవులను కొట్టివేసే కార్యక్రమం కొనసాగుతూంది. కొన్ని దేశాలలో జనాభా పెరుగుదల, పశువుల మేత, కొత్త మొక్కలు నాటకపోవడం కారణంగా అడవుల అంతర్ధానం రేటు సంవత్సరానికి 1 శాతం ఎక్కువ అవుతూంది.

"మీమీద మీకు నమ్మకం లేనప్పుడు దేవుని మీదా నమ్మకం కలుగదు."

2.28 లక్షల కంటెయినర్లను రవాణా చేస్తే, బొంబాయి ఒక్కటే 1.3 లక్షల కంటెయినర్ల రవాణాను నిర్వహిస్తూంది.

* * *

## ప్రపంచ కార్మికులలో 45 ఏళ్ళు పైబడినవారు:

అంతర్జాతీయ కార్మిక సంస్థ (ILO) ప్రపంచ కార్మికులలో 45 ఏళ్ళ పైబడిన వయస్సు గలవారు సుమారు యాభై కోట్ల మంది-అంటే మొత్తం కార్మికులలో 27 శాతం - ఉండవచ్చు నని అంచనా వేశారు. 2,000 వ సం.రం నాటికి వారి సంఖ్య మరో 20 కోట్లు పెరుగవచ్చునట! వర్ధమాన దేశాలలో 45 ఏళ్ళ పైబడిన కార్మికుల శాతం 33; 55 ఏళ్ళ పైబడిన వారి శాతం 12.7.

* * *

## జపాన్ స్త్రీ, పురుషుల సగటు వివాహ వయస్సులు:

1980 లెక్కల ప్రకారం జపాన్‌లో పురుషులు సగటున 27.8 ఏళ్ళకూ, స్త్రీలు 25.2 ఏళ్ళకూ పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు స్త్రీలలో జూనియర్ కాలేజ్‌లలోనూ, యూనివర్శిటీలలోనూ చేరేవారు 33.5 శాతం. సాధారణంగా పట్టభద్రులు అయే వయస్సు 22. పట్టభద్రులైన తరువాత స్త్రీలు ఏదో కంపెనీలో 3 ఏళ్ళు పని చేసి, ఆ తరువాత వివాహం చేసుకుంటారు.

* * *

## తలసరి పొదుపులో గోవా ముందంజ:

భారత దేశంలో తలసరి పొదుపు విషయంలో కేంద్రపాలిత రాజ్యం అయిన గోవా అగ్రస్థానంలో ఉంది. 1981-82లో గోవాలో తలసరి పొదుపు రూ. 130లు కాగా, 1982-83 నాటికి అది రూ. 140.42 లకు పెరిగింది. రెండవ స్థానంలో ఉన్న ఢిల్లీలో తలసరి పొదుపు రూ. 100 లు. హిమాచల్ ప్రదేశ్, మహారాష్ట్ర లలో వరుసగా రూ.57.90 రూ. 49.60.

## ఇండియాలో సైకిళ్ళ ఉత్పత్తి



ఇండియాలో సాలీనా సుమారు 60 లక్షల సైకిళ్ళు ఉత్పత్తి అవుతున్నాయి. ఈ అంశంలో ప్రపంచంలోని 6 ప్రముఖ దేశాలలో ఇండియా ఒకటి. తక్కినవి: అమెరికా, చైనా, రష్యా, జపాన్, తైవాన్. ఏటా ఇండియాలో బైసికల్ భాగాలే రూ. 124 కోట్ల విలువ చేసేవి ఉత్పత్తి అవుతున్నాయి. వీటిలో 83 శాతం ఉత్పత్తి లూఢియానా (పంజాబ్) లో జరుగుతూంది.

"పరిచయం పెరిగి పరిపక్వంచడం మొదలుపెడితే ప్రేమ అవుతుంది." —జాన్సన్

# హేమ్లెట్ నిజంగా ఉన్నాడా?

రాఘవేంద్ర రావు

విలియమ్ షేక్స్పియర్ వ్రాసిన 37 నాటకాలలోనూ అన్నిటికంటె సుదీర్ఘమైంది 'హేమ్లెట్.' దీనిలో మొత్తం 4,042 పంక్తులూ, 29,551 మాటలూ ఉన్నాయి. ఆ మాటలలో 11.610 మాటలు నాయకుడైన 'హేమ్లెట్' నోట వెలువడేవే!

హేమ్లెట్ నిజంగా ఉన్నాడా? నిస్సందేహంగా ఉన్నాడు. అతడు ఒక 'డేన్'. డేనిష్ భాషలో అతని పేరు 'అమ్లెత్' (Amleth). 11 వ శతాబ్దంలో డెన్మార్క్‌ను ఏలిన ఒక ఆదిమజాతి నాయకుని కుమారుడు అమ్లెత్. సింహాసనం మీద ఆశతో కొంత, 'అమ్లెత్' తల్లిని ప్రేమించడంవల్ల కొంతా 'అమ్లెత్' పినతండ్రి 'అమ్లెత్' తండ్రిని హత్య చేశాడు.

అమ్లెత్ వయస్సు అప్పుడు 19 ఏళ్ళు. ఆ వరుసలో తరువాత హత్య చేయబడేది తనే అని 'అమ్లెత్' గుర్తించాడు. వెంటనే పిచ్చెత్తినట్టు నటిస్తూ 24 గంటలూ అగ్నిగృహం (fire place) లోనే గడుప సాగాడు. ఒక రాత్రి కావలి భటులచేత చిత్తుగా తాగించి, వాళ్ళు ఒళ్ళు తెలియకుండా పడి ఉన్న సమయంలో ఒక కత్తి సంపాదించి పినతండ్రి పడక గదిలో ప్రవేశించి, అతణ్ణివధించాడు. సంతోషంగా ప్రజలందరూ 'అమ్లెత్'ను తమ రాజుగా స్వీకరించారు.

చారిత్రకంగా జరిగిన ఈ కథే షేక్స్పియర్ వ్రాసిన హేమ్లెట్ నాటకానికి ఆధారం. అయితే - షేక్స్పియర్ కంటె ముందే-ఈ కథ జరిగిన 300 ఏళ్ళకే-శాక్సో

(మిగతా 53వ పేజీలో)

## ప్రస్తుతం ప్రపంచంలో యుద్ధం జరుగుతున్న దేశాలు



వాషింగ్టన్‌లోని 'సెంటర్ ఫర్ డిఫెన్స్ ఇన్ఫర్మేషన్' వారి లెక్కల ప్రకారం ప్రస్తుతం 45 దేశాలలో - అంటే ప్రపంచంలో 4 వ వంతు కంటె ఎక్కువ దేశాలలో - యుద్ధాలు జరుగుతున్నాయి. 40 లక్షల మంది సైనికులు ప్రత్యేకంగా ఆ యుద్ధాలలో పాల్గొంటున్నారు. దాదాపు 40, 50 లక్షల దాకా ప్రజలు హతులయారు. యుద్ధ నిమగ్నమైన ఆ దేశాలలో 20 దేశాలకు అమెరికా, 13 దేశాలకు రష్యా ఆయుధాలు సరఫరా చేస్తున్నాయి.

"తాటాకుల చప్పుళ్ళకు కుందేళ్ళు బెదరవు!" —తెలుగు సామెత

(12 వ పేజీ తరువాయి)

వద్ద 2,000 మెగావాట్‌ల విద్యుచ్ఛక్తిని ఉత్పాదించే ఒక సూపర్ పవర్ థెర్మల్ స్టేషన్‌ను 'కేంద్రరంగం' (central-sector) లో నిర్మించడానికి కేంద్ర ప్రభుత్వం సమ్మతించింది.

పారిశ్రామికంగా బిహార్ వెనుకబడ్డ రాష్ట్రం. ఖనిజ సంపద ఎక్కువగా ఉన్న దక్షిణ ప్రాంతంలో అనేక భారీ పరిశ్రమలు వెలిశాయి. ఒకప్పుడు 'సాక్షి' అనబడే అనామకమైన ఒక కుగ్రామం భారీపరిశ్రమల స్థాపనతో జంషెడ్‌పూర్ అనే 'ఉక్కు' నగరంగా ఈ నాడు అభివృద్ధి చెందింది. ఈ రాష్ట్రంలో ఉన్న ఇతర పరిశ్రమల వివరాలు:

బొకారో —స్టీల్ ప్లాంట్
బరౌనీ —నూనెశుద్ధి కర్మాగారం
రాంచి —భారీయంత్ర పరికరాలను ఉత్పత్తిచేసే కర్మాగారం
మూరీ —అల్యూమినియమ్ ప్లాంట్
తుండు —జింక్ ఉత్పత్తి ఫాక్టరీ
జడుగుడా —యురేనియమ్ శుద్ధికర్మాగారం
సింద్రీ —ఎరువుల ఫాక్టరీ
గోమియా —బాంబులు తయారుచేసేఫాక్టరీ
ఘట్‌శిలా —రాగి కరిగించే ఫాక్టరీ.

టసర్ సిల్కు పరిశ్రమకు బిహార్ మిక్కిలి ప్రసిద్ధి! దాదాపు లక్షమంది కార్మికులు ఆ పరిశ్రమలో పని చేస్తున్నారు.

బిహార్‌లో పట్టణాల సంఖ్య 202. ప్రధాన నగరాలు: పాట్నా, జంషెడ్‌పూర్, గయ, రాంచి, భగల్‌పూర్. ప్రాచీన ప్రశస్తి గల పాట్నా నగరం గంగా, సోనే నదుల సంగమ స్థానంవద్ద ఉంది. భారత ప్రథమ రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ గారి సదాఖత్ ఆశ్రమం పాట్నాలోనే ఉంది. ఆయన

(మిగతా 52 వ పేజీలో)

---

# మెరుపు వేగంతో పనిచేసే మెదడు



"మనస్సు వేగానికి కూడా హద్దులు ఉంటే ఉండవచ్చును గాని, ఇంతవరకూ వాటిని గుర్తించిన వారు లేరు" అంటారు. రష్యాలోని 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎక్స్‌పెరిమెంటల్ మెడిసిన్' డైరెక్టర్ నటాల్యా బెఖ్తెర్వా. అపాయంలో చిక్కుకున్నప్పుడు అత్యద్భుతమైన వేగంతో మనస్సు పనిచేసిన నిదర్శనా లెన్నో ఉన్నాయి. వీటివల్ల మనస్సు తన 'అంతరమైన కాలానికి' inner time) అనుగుణంగా తన వేగాన్ని మార్చుకోగల దని స్పష్టం అవుతుంది.

"మనకు ఇష్టమైనవి మనకు లభించకపోతే లభించిన వాటినే ఇష్టపడడం నేర్చుకోవాలి!" —బుస్సీ-రాబ్యుటిన్

# కంటిలో ప్లాస్టిక్ లెన్స్

డా॥ డి. సి. అగర్వాల్

[డా॥ డి. సి. అగర్వాల్, ఎం. ఎస్. ప్రస్తుతం అమృత్సర్ (పంజాబ్) లోని మెడికల్ కాలేజ్‌లో 'అఫ్తాల్మాలజీ' (నేత్రచికిత్స) విభాగంలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా ఉన్నారు.]

ప్రతి కంటిలోనూ ఒక భూతద్దం (lens) ఉంటుంది. అదే కంటిలో 'చూసే' భాగం. బయటి వస్తువుల మీద నుంచి వచ్చే కాంతి కిరణాలు దానిగుండానే ఫోకస్ అయి కనుగ్రుడ్డు వెనుక భాగాన ఉన్న 'నేత్రపటం' (retina) మీద పడుతాయి. వృద్ధాప్యంవల్ల గాని, కంటికి దెబ్బ తగలడంవల్ల గాని, ఇతర కారణాలవల్ల గాని ఒక్కొక్కప్పుడు ఈ భూతద్దం పారదర్శకత్వాన్ని (transparency) కోలుపోయి, గాజువారిపోవడం జరుగుతుంది. అప్పుడు దృష్టి మందగిస్తుంది. వ్యక్తి తన దైనందిక కార్యాభారం సక్రమంగా నిర్వర్తించుకోలేక పోతాడు. ఇలా కంటి భూతద్దం గాజువారి పోవడం, లేదా కంట్లో శుక్లాలు ఏర్పడడం జరిగితే 1949 వరకూ దీనికి ఒక్కటే చికిత్స జరిగేది. ఆపరేషన్ ద్వారా కంటిలోని ఆ భూతద్దాన్ని తీసి వేయడం, 'అఫాకిక్' కళ్ళ అద్దాలు ధరింప జేయడం. మామూలు కళ్ళ అద్దాల కంటె ఈ 'అఫాకిక్' కళ్ళద్దాలు అనేక విధాలుగా భిన్నమైనవి:

1. ఈ కళ్ళద్దాలు చాలా మందంగానూ, బరువుగానూ ఉండి ఎక్కువ పవర్ కలిగి ఉంటాయి.

2. ఈ అద్దాలతో ఎదురుగా చూస్తున్నప్పుడు మాత్రమే వస్తువులు కచ్చితంగా కనిపిస్తాయి.

## గంటకు 60 మైళ్ళ వేగంతో పోయే 'గజెల్' దుప్పి



ఆఫ్రికాలో కనిపించే 'గజెల్' అనే చిన్న సైజు దుప్పి ప్రపంచంలో మిక్కిలి వేగంగా పరిగెత్తే జంతువులలో ఒకటి. కొద్ది దూరాలైతే గంటకు 60 మైళ్ళ వేగంతో అది పరుగెత్తగలదు. 2 రోజుల వయస్సు గల 'గజెల్' కూడా పూర్తిగా ఎదిగిన గుర్రాన్ని పరుగులో ఓడిస్తుంది.

"దేవుడు నీ మెడల్‌లూ, డిగ్రీలూ, డిప్లొమాలూ చూడడు:
నీ ఒంటి మీది గాయాల మచ్చలు చూస్తాడు!" —ఎల్బర్ట్ హుబార్డ్

3. అసలు సైజుకంటె వస్తువులు 25 శాతం పెద్దవిగా కనిపిస్తాయి.

4. శుక్లాలు వచ్చి ఆపరేషన్ చేయించు కోని మంచి కన్ను ఒకటి ఉంటే తప్ప. లేక పోతే ఈ అద్దాలవల్ల ఒక వస్తువు రెండుగా కనపడే దృష్టిదోషం (double vision) ఏర్పడే ప్రమాదం ఉంది.

5. ప్రక్క వస్తువుల చూపు బాగా తగ్గి



సింగ్ - వోర్స్ట్ ఐరిస్ క్లా లెన్స్

పోయి జనసమ్మర్థం ఉన్న ప్రాంతాలలో రోగి స్వేచ్ఛగా తిరగడం కష్టం అవుతుంది. మెట్లు ఎక్కడంలో తడబాటు సంభవిస్తుంది. కళ్ళు కనిపిస్తూనే ఉన్నా ఈ విధంగా ఈ కళ్ళద్దాలవల్ల రోగులు అనేక ఇబ్బందులకు గురి అవుతారు.

శుక్లాల ఆపరేషన్ తాత్కాలికంగా కొంత సదుపాయం కలిగించగల చికిత్సే గాని రోగికి మళ్ళీ మామూలు దృష్టి నీయగల సంపూర్ణ చికిత్స కాదు. ఈ ఆపరేషన్ చేయించుకున్న రోగులలో 85 శాతం మళ్ళీ తమ వెనుకటి పనులు మామూలుగా నిర్వర్తించుకోలేక పోతున్నారని అంచనా వేయబడింది.

కంటిలో శుక్లాలు పెరిగిన 'భూతద్దాన్ని' తొలగించే ఈ ఆపరేషన్ స్థానే వాడదగిన మరి రెండు చికిత్సా విధానాలు ఉన్నాయి. ఒకటి: కంటిలోపలి భాగంలో కాంటాక్ట్ లెన్స్ అమర్చడం. రెండు: దెబ్బతిన్న భూతద్దం స్థానే శాశ్వతంగా కృత్రిమమైన ప్లాస్టిక్ భూతద్దాన్ని అమర్చడం. కాంటాక్ట్ లెన్సుకంటె ప్లాస్టిక్ లెన్స్‌ను అమర్చడం వల్ల మూడు లాభా లున్నాయి:

1. దానిని మాటి మాటికీ తీయడం, పెట్టు కోడం అవసరం ఉండదు.

2. రోగికి కంటిలో ఏదో ఉందనే ధ్యాస ఏ మాత్రం ఉండదు.

3. శేష జీవితం అంతా ఆ కృత్రిమపు

---

(50 వ పేజీ తరువాయి)

వ్యక్తిగతమైన వస్తువులనూ, రాష్ట్రపతిగా ఆయన అందుకున్న బహుమతులనూ ప్రదర్శించే ఈ ఆశ్రమంలోని మ్యూజియమ్ ముఖ్యంగా చూడదగ్గది. పాట్నాలోని సుప్రసిద్ధమైన ఖుదాబక్ష్ గ్రంథాలయంలో అమూల్యమైన పర్షియన్, అరబిక్ వ్రాతప్రతులూ, రాజపుత్ర, మొగలాయీ చిత్రపటాలూ భద్రపరచబడి ఉన్నాయి. రూ. 10 కోట్ల వ్యయంతో ఒక ఉన్నతస్థాయి పోస్ట్ గ్రాడ్యుయేట్ మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌ను రాష్ట్ర ప్రభుత్వం ఇక్కడ నెలకొల్పుతున్నది.

బిహార్ జనాభాలో 57.49 శాతం దారిద్ర్య రేఖకు దిగువను నికృష్టంగా జీవిస్తున్నారు. ఇండియా మొత్తం మీద ఇలాంటి వారి శాతం 48.13 మాత్రమే!

---

"పేదలు 'శాసనాల' క్రింద పడి నలుగుతారు;
ధనికులు 'శాసనాలను' శాసిసారు."
—గోల్డ్ స్మిత్

లెన్స్‌తో అతడు మామూలుగా చూడగలుగుతాడు.

అయితే-కంట్లో ప్లాస్టిక్ లెన్స్‌ని అమర్చే శస్త్ర చికిత్స ఏమంత సరళమైంది కాదు. దానికి చాలా అనుభవం ఉండాలి. ఈ ఆపరేషన్‌లో కేవలం 5 మైక్రోన్‌ల దళసరి



సింగ్ ప్యూపిలరీ ప్లేన్ లెన్స్

మాత్రమే ఉండే మిక్కిలి పల్చని పొరను-కంటిలోని లెన్స్ అడుగున ఉండి దాని నంటి పెట్టుకుని ఉండేదాన్ని - ఆ లెన్స్ నుంచి వేరుచేసి కంటిలో నిలిచి ఉండేట్టు చూడాలి. ఆ పొర ఆపరేషన్ జరిగే కంటికి ఎక్కువ భద్రతను కలిగిస్తుంది.

కృత్రిమపు లెన్స్‌ను కంట్లో అమర్చే మొట్ట మొదటి ఆపరేషన్‌ను 1949 లో 'రిడ్లీ' అనే డాక్టర్ చేశారు. అంతకు ముందు ఒక సారి ఒక శుక్లాల ఆపరేషన్ జరుగుతూ ఉండగా ఒక విద్యార్థి "ఆ లెన్స్ స్థానే కొత్త లెన్స్‌నే ఎందుకు అమర్చలేరు?" అని యథాలాపంగా అన్న మాటను ఒక సవాలుగా తీసుకుని ఆయన ఆ ఆపరేషన్ చేశారు.

1949 తరువాత కృత్రిమపు లెన్స్ డిజైన్‌లోనూ, దానిని కంట్లో అమర్చే టెక్నిక్‌లోనూ చాలా అభివృద్ధి సాధించారు. ప్రపంచం అంతటా నేత్ర శస్త్ర వైద్యులెందరో ఈ రంగంలో చాలా అనుభవం గడించారు.

4 సం. ల క్రితం చూస్తే అమెరికాలో శుక్లాలు పెరిగిన రోగులలో 25 శాతం మంది మాత్రమే ఈ ప్లాస్టిక్ లెన్స్ పెట్టించుకున్న వారు కనిపించేవారు. అలాంటిది ఇప్పుడు ఆ సంఖ్య 60 శాతానికి పెరిగింది.

ఇండియాలో 1960 లలో ప్లాస్టిక్ లెన్స్ అమర్చే విషయంలో కొంత సంకోచంతో ఒకే ఒక ప్రయత్నం జరిగింది. కాని ఆ తరువాత అమృత్‌సర్‌లోని మెడికల్ కాలేజ్‌లో నేత్ర శస్త్ర వైద్యం ప్రొఫెసర్ డా॥ దళ్‌జిత్‌సింగ్ ఈ విషయంలో గట్టి కృషి ఆరంభించారు. 1976 లో ఆయన ఈ ఆపరేషన్‌లు

---

(49 వ పేజీ తరువాయి)

గ్రమేటికస్ పరిశుద్ధమైన లాటిన్ భాషలో దీనిని నాటకంగా వ్రాశాడు. సగం పుక్కిటి పురాణం, సగం చరిత్ర అయిన ఈ డేనిష్ కథ అసాధారణమైన షేక్స్‌పియర్ కవితా ప్రతిభ వల్ల అనంతరం 1601లో ఇంగ్లీష్ భాష అంతటిలో మిక్కిలి ప్రసిద్ధమైన విషాదాంత రూపకంగా అవతరించింది.

అయితే ఒక్క మాట చెప్పాలి. నిజం హామ్లెట్ షేక్స్‌పియర్ నాటకంలో ఉన్న 'ఎల్సినోర్' దుర్గాన్ని ఎన్నడూ చూపిన పాపాన పోలేదు. ఆ తరువాత 700 ఏళ్ళకు కాని అసలు ఆ దుర్గం నిర్మించబడలేదు! ●

"రాజకీయాలు రాజకీయవేత్తలకూ, ఆర్థిక విషయాలు కాలేజీ ప్రొఫెసర్‌లకూ వదలి ఊరుకోరాదు." —హెన్రీ జార్

చెయ్యడం మొదలు పెట్టారు. ఇప్పటికి ఆయన 1400 దాకా అలాంటి ఆపరేషన్‌లు చేశారు. చాలా రకాల 'లెన్స్' డిజైన్‌లను ఆయన వాడుక చేశారు. హాలండ్‌కు చెందిన సుప్రసిద్ధ వైద్యుడు డా॥ జాన్‌వోర్స్టిట్‌తో కలిపి ఆయన కనిపెట్టిన 'డిజైన్ సింగ్-వోర్స్టిట్ ఐరిస్ క్లా లెన్స్' అని ప్రసిద్ధి పొందింది ఆ తరువాత స్వయంగానే 'సింగ్ ప్యూపిలరీ ప్లేన్ లెన్స్' అనే మరో డిజైన్ ఆయన రూపొందించారు.

అన్ని డిజైన్‌లలోకీ 'సింగ్-వోర్స్టిట్ లెన్స్' ఎక్కువ ప్రశస్తమైంది. అది బయటి గాలిలో కేవలం 7 మిల్లీ గ్రాముల బరువూ, కంట్లో అమర్చబడినప్పుడు 1 మిల్లీగ్రాము కంటె తక్కువ బరువు మాత్రమే ఉంటుంది. 'ఐరిస్'తో దీనిని అతకడంలో ఇమిడి ఉన్న కంటిలోని ద్రవంలో ఇది తేలియాడుతూ ఉండేట్లుగా అతుకుతారు రెండుచోట్ల క్లిప్‌లతో ఇది ఐరిస్‌కి అంటిపెట్టుకుని ఉంటుంది. కనుగ్రుడ్డు కదలికకు ఇది ఏవిధంగానూ అంతరాయం కలిగించదు శుక్లాలు తొలగించే ఆపరేషన్ సమయంలోనే ప్రాథమిక లెన్స్‌గా దానిని అమర్చవచ్చును లేదా ఆ ఆపరేషన్ జరిగిన కొన్నాళ్ళకు 'ద్వితీయ' (secondary) లెన్స్‌గా కూడా దీనిని అమర్చవచ్చును.

'సింగ్-వోర్స్టిట్ ఐరిస్ క్లా లెన్స్' అమర్చడంలో డా. సింగ్ మిక్కిలి అనుభవజ్ఞులు. అయితే కృత్రిమపు ప్లాస్టిక్ లెన్స్‌ను, అమర్చే ప్రక్రియ ఇండియాలో ఇంకా ఆరంభ దశలోనే ఉందని చెప్పాలి. రోటరీ ఇంటర్నేషనల్ వారు డా. సింగ్ సహకారంతో అనతి కాలంలో ఈ కృత్రిమపు ప్లాస్టిక్ లెన్స్‌లను ఇండియాలోనే ఉత్పత్తి చేసేందుకు ప్రయత్నాలు చేస్తున్నారు. ●

## తెప్పల పడవ మీద అట్లాంటిక్ దాటిన సాహసులు!



జార్జ్ హార్బో, ఫ్రాంక్ శామ్యూయెల్సన్ అనే ఇద్దరు అమెరికన్ సాహసులు తమ భుజబలం తప్ప వేరెలాంటి 'శక్తి' సాయం లేకుండా అట్లాంటిక్ మహా సముద్రాన్ని దాటారు. 1896 జూన్ 6 న 18 అ.ల పొడవున్న ఒక పడవలో 5 జతల తెడ్లూ, 60 గాలన్ల మంచినీరూ డబ్బాలలో సీల్ చేసిన ఆహార పదార్థాలూ వెంట తీసుకుని న్యూయార్క్ హార్బర్ నుంచి వారు బయలుదేరారు ఒక్కొక్కరు రోజూ 18 గం.లు తెడ్లు వెయ్యడంలో, 5 గంటలు విశ్రాంతిలో, ఒక గంట భోజనంలో గడుపుతూ 56 రోజులు అలా ప్రయాణించి, ఇంగ్లండుకు చెందిన 'సిల్లీ దీవులకు' (isles of scilly) భద్రంగా వారు చేరుకున్నారు.

"శక్తికి అనుగుణంగా పని చెయ్యాలి;
అవసరాల కనుగుణంగా ప్రతిఫలం ముట్టాలి!" —కార్ల్‌మార్క్స్

# విజ్ఞానవేదిక

## సూర్యునిలోని మచ్చల రహస్యం!

సూర్యునిలోని మచ్చలు (sun spots) చిన్న చిన్న నల్లని చుక్కలలాగ కనిపిస్తాయి ఒక గుంపుగా ఏర్పడిన సందర్భంలో అవి సూర్య మండలం మీద ఏర్పడిన సిరా మరకల లాగ ఉంటాయి. చుట్టూ



ఉన్న సూర్యుని ఉపరితలంలోని వేడిమిలోనూ, ప్రకాశంలోనూ సగం మాత్రమే ఆ చుక్కలలో ఉండడంవల్ల అవి మనకు నల్లగా కనిపిస్తాయి.

చూడడానికి చిన్నవిగా కనిపించినా నిజానికి ఆ మచ్చలు బ్రహ్మాండమైన పరిమాణం గలవి. ఒక పెద్దసైజు చుక్కలో మన భూమిని పడవేయడం జరిగితే ఒక సరస్సులోకి విసిరిన గులకరాయిలాగా అది అందులో బుడుంగున మునిగిపోతుంది అంత పెద్దవి ఆ మచ్చలు. సూర్యుని లోపలి భాగంలో సంభవించే భయంకరమైన ప్రేలుళ్ళ ఫలితంగా ఏర్పడిన సుడులు తిరిగే తుఫాన్లు ఆ మచ్చలు అని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. మెరుస్తూ ఉండే 'ఉదజని' లేదా ఇతర వాయువుల మేఘాలు సెకనుకి 60 మైళ్ళ వేగంతో తరచు ఆ సుడులలోకి ఆకర్షించబడుతూ ఉంటాయి.

సూర్యునిలోని మచ్చలకూ, మనభూమికీ చిత్రంగా సన్నిహితమైన సంబంధం కనిపిస్తుంది. ఉత్తర ధ్రువ ప్రాంతంలో రాత్రి పూట ఆకాశంలో రంగు రంగుల కాంతుల రూపంలో కనిపించే 'అరోరా బొరియాలిస్' సూర్యునిలోని మచ్చలు మిక్కిలి పెద్దవైనప్పుడు మరింత ప్రకాశవంతంగా కనిపిస్తుంది. ఇది 11 ఏళ్ళ కొకసారి జరుగుతుంది. భూమి మీది వేసవి కాలాలు ఒకప్పుడు మరీ దారుణంగానూ, మరొకప్పుడు చల్లగానూ మారుతూ ఉండడం కూడా ఈ 11 ఏళ్ళ ఆవృత్తు (cycles) లలోనే సంభవిసుంది.

"తప్పు చేయడం కంటె మరొకరి తప్పిదం వల్ల బాధ పడడం ఎంతో సుఖం." —జాన్సన్

# మరల గర్భవతులా!

మీరు కలత చెంద వద్దు



## మీ గర్భధారణను పరిసమాప్తి చేయించుకోండి

గర్భ స్రావము చట్ట సమ్మతమైనది



అన్ని ప్రభుత్వ ఆసుపత్రులలోను ఉచితంగా గర్భధారణను పరిసమాప్తి గావించుకొనుటకు సదుపాయాలు లభిస్తాయి.

మొదటి పన్నెండు వారాలలోను గర్భ స్రావము సరళమైనది. క్షేమకరమైనది

ఇద్దరు చాలు
మూడోదానికి పోవద్దు

జ్ఞాపకముంచుకోండి : పదే పదే గర్భ స్రావాలు ఆరోగ్యానికి ప్రమాదకరము.
తగిన కుటుంబ నియంత్రణా పద్ధతిని అవలంబించండి.

(8 వ పేజీ తరువాయి)

చరిత్ర' రచయిత డా. పట్టాభి సీతారామయ్య మాటలలో—"ప్రత్యేకమైన, విలక్షణమైన వక్తృత్వ ధోరణి గల ఒక చెప్పుకోదగ్గ కాంగ్రెస్ నాయకుడు ఆయన."

నాగపూర్ కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షుడుగా ఆయన ఎన్నిక అయారు. బొంబాయికి చెందిన హేమా హేమీ ఫిరోజ్ షా మెహతా అనంతరం వెంటనే ఆయనను ఆ గద్దె వరించడం ఒక విశేషం! తమ అధ్యక్షోపన్యాసంలో శ్రీ అనంతాచార్యులు భారత జాతీయతావాద దృక్పథాన్ని వివరించి, ఇండియా డిమాండ్ చేసే రాజకీయ స్వతంత్ర ప్రతిపత్తి స్వరూపం స్పష్టం చేశారు. ఆ తరువాతి సంవత్సరాలలో ఒక కాంగ్రెస్ సెషన్‌ని ఇంగ్లండ్‌లో జరపా లన్న ప్రతిపాదనను ఆయన సమర్థించారు. దానివల్ల భారతదేశంలోని పరిస్థితులను గూర్చిన బ్రిటిష్ ప్రజాసామాన్యపు అవగాహన అధికం కాగల దనీ, అలాంటి సెషన్ వల్ల లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ఎన్నికయే సభ్యులకు కొన్ని సీట్లు సాధించడం సాధ్యంకాగల దనీ ఆయన వాదించారు.

రాజకీయాలలో ఆయన 'అతివాది' కాకపోయినా, 'అనుచితం' అని తాను భావించిన దానిని ఖండించడానికి ఆయన ఎన్నడూ వెనుకాడలేదు. లండన్‌లో 'సెక్రటరీ ఆఫ్ స్టేట్'కి సలహాలు ఇచ్చే 'ఇండియన్ కౌన్సిల్'ను "వయస్సు మళ్ళి ఇండియాలో సర్వీస్‌కి పనికి రాక, శిలాస్థులు (fossils) గా మారిన కొద్దిమంది భారతీయ పరిపాలనా నిర్వాహకుల బృందం" అని ఆయన అభివర్ణించారు. శాంతియుత మార్గాలలో విజయ సాధనకు ముందంజ వేయ మని సహచరులను ప్రబోధించారు.

## ప్రపంచంలో అంధుల సంఖ్య



జీవన ప్రమాణాలు పడిపోవడం, వాతావరణ కాలుష్యం, ఆరోగ్య రక్షణ వసతులు లోపించడం కారణంగా ప్రపంచంలో అంధుల సంఖ్య నానాటికీ పెరుగుతూం దని సుప్రసిద్ధ ఆరోగ్యశాస్త్ర నిపుణులు ఆందోళన చెందుతున్నారు. ప్రస్తుతం ప్రపంచంలో 2.8 కోట్ల మంది అంధు లున్నట్టు అంచనా! తగిన జాగ్రత్తలు తీసుకుంటే వీరిలో 75 శాతం అంధులు కాకుండా నివారించవచ్చును. ఈ విషయమై శీఘ్రంగా తగిన చర్య తీసుకోకపోతే 2,000 వ సం. రం నాటికి ప్రపంచంలో అంధుల సంఖ్య 5.6 కోట్లు కాగల దని భయపడుతున్నారు. శుక్లాలతో దృష్టి లోపించిన 1.7 కోట్ల మందికి ఆపరేషన్ల ద్వారా దృష్టిని తిరిగి ప్రసాదించవచ్చును.

"సంతోషం, చేతినిండా పనీ గంటలు
నిముషాలుగా గడిచిపోయేట్టు చేస్తాయి." —షేక్స్‌పియర్

"కదలిన స్వాతంత్ర్య రథం ఆగదు
కష్టా లెన్నెదురైనా చివరికి విజయం
తప్పదు!"

అన్న కవిగారి ప్రబోధ గీతంతో ఆయన తన అధ్యక్ష ప్రసంగాన్ని ముగించారు.

రాజ్యాంగబద్ధమైన, ధర్మ మార్గం తప్పని విధానాల ద్వారానే విజయం సాధించడం ఆయన అభిమతం. అనంతాచార్యుల వంటి ఆ తొలి స్వాతంత్ర్య యోధులు శంఖం పూరించి ఆరంభించిన ఆ సంగ్రామం 4 దశాబ్దాల అనంతరం విజయవంతం అయింది.

సాంఘిక రంగంలో ఆ నాటి పరిస్థితులలో ఆయన తీవ్రవాది అని చెప్పాలి. అర్థం పర్థం లేని పాత ఆచారాలను చాలా వాటిని ఆయన పాటించేవాడు కాదు. వితంతువైన శ్రీ జి. సుబ్రహ్మణ్య అయ్యర్ కుమార్తెకు పునర్వివాహం చేయగా తీవ్రమైన సంఘ ప్రతిఘటన ఎదురైనప్పుడు శ్రీ అనంతాచార్యులు సంస్కారుల పక్షాన నిలిచి పోరాడారు. వితంతు పునర్వివాహం హిందూ ధర్మ శాస్త్ర విరుద్ధంకాదని వివిధ ప్రాచీన గ్రంథాల నుంచి ఆధారాలు ఉదాహరిస్తూ ఆయన ఒక చిన్న పుస్తకం కూడా ప్రకటించారు. విద్య, ఆస్తిపాస్తులు మొదలైన అన్ని రంగాలలో స్త్రీల హక్కులను ఆయన సమర్థించారు.

తన రాజకీయ పదవి ఆధారంగా ప్రభుత్వంలో ఉన్నత పదవి సంపాదించాలని ఆయన ఎన్నడూ అర్రులు చాచి ఉండక పోవడం వల్ల ఆ నాటి యువకులకు ఆయన గొప్ప 'హీరో' అయారు. దేశభక్తుడే కాని, ఆయన ఎన్నడూ పదవీ వ్యామోహపరుడు కాడు. శారీరక, మానసిక శక్తులు ఇంకా చెక్కు చెదరకుండా నిలిచి ఉన్న వయస్సులోనే దేశంలో అసంఖ్యాకులుగా ఉన్న తన అభిమానులనూ, అనుయాయులనూ గాఢ పరితాపంలో ముంచి, 1908 లో ఆయన పరమ పదించారు.

## తాజ్‌మహల్ సంరక్షణకు ఏర్పాట్లు



ఆగ్రా (ఉత్తర ప్రదేశ్) లోని తాజ్ మహల్ సౌందర్యం వాతావరణ కాలుష్యం వల్ల దెబ్బతిని పోకుండా సంరక్షించేందుకు ప్రత్యేక చర్యలు తీసుకుంటున్నారు. వాటిలో ఆ భవనం చుట్టూ చెట్ల వరుసలను పెంచడం ఒకటి. 1982 తరువాత ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం ఇప్పటికి అక్కడ 1.6 లక్షల మొక్కలు నాటింది. వాతావరణాన్ని కలుషితం చేసే కొత్త పరిశ్రమలను స్థాపించడం గాని, ఉన్నవాటిని విస్తరింప జేయడం గాని నిషేధింపబడింది.

---

"నాకు చాలా ఇష్టం అయినా, అర్థం కానివి మూడు:
'చిత్రలేఖనం', 'సంగీతం', 'స్త్రీలు'!" —ఫాంటెనెలీ

# పోటీలు

జూలై 1984

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొనవచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: జూలై **20, 1984.** పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

"సృష్టిలో సమానత్వం ఉందా?' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

---

## ప్రాణరక్షణకు తోకలను విసర్జించే బల్లులు



'శత్రువులు వెంటబడ్డప్పుడు చాలా రకాల బల్లులు తమ తోకలను వాటికి ఆహారంగా వదిలి తమ ప్రాణాలు కాపాడుకుంటాయి' అని ప్రకటించారు—టెక్సాస్ (ఏ. అండ్ ఎమ్.) శాస్త్రవేత్త బెంజిమిన్ డయాల్, టెక్సాస్ స్టేట్ యూనివర్సిటీ శాస్త్రవేత్త లాయిడ్ ఫిట్జ్‌పాట్రిక్. ఒక పిల్లిని బల్లుల మీదికి వదలి వారు ఒక ప్రయోగం చేసి చూశారు. తోకలను తమ వెనుక వదలివేసి ఒక్క బల్లి కూడా పిల్లివాత పడకుండా అవి తప్పించుకున్నాయి.

"ప్రపంచాన్ని తలక్రిందులుగా చదివి, లోకం మనని మోసగిస్తున్న దని అంటాము."

## క్విజ్

1. న్యూఢిల్లీలో మన ప్రెసిడెంట్ ఉండే మందిరాన్ని ఏమంటారు? 2. కొరియా రిపబ్లిక్ (ద.కొరియా) రాజధాని ఏది? 3. 'నటరాజు' అని ఏ దేవుణ్ణి అంటారు? 4. 'భాషల వారీగా దేశాన్ని విభజించడం' - దీన్ని ఒకే సమాసంలో చెప్పండి, 5. 'సంతోష్ ట్రాఫీ' ఏ ఆటకు సంబంధించింది? 6. అమెరికా, యూరప్‌ల మధ్య ఉన్న మహాసముద్రం ఏది? 7. ఐ.రా.స. పూర్తి పేరు ఏమిటి? 8. 'గోల్డెన్ టెంపుల్' ఎక్కడ ఉంది?

## పజిల్



ఆధారాలు — అడ్డం: 1. ఖాజీపేటకీ హైదరాబాద్‌కీ మధ్య ఒకమాదిరి పెద్దస్టేషన్, 4. నిడదవోలుకీ, భీమవరానికీ మధ్య ఉన్న ఒక చిన్న పట్టణం, 6. పచ్చీసు ఆటలో పందెం వేటితో వేస్తారు? 7. తల్లకిందులైన పెడన, 8. పరిమళించే ఒక ఇంటి పేరు, 9. లలనా!, 10. విష్ణువు ద్వార పాలకులలో మొదటి వాని కథే రావణుని కథ; 12. యౌవనంలో ఉన్న, 15. గాథ, 16. మొదలు కాని నిముసం, 18. ముక్కంటి, 22. ఉత్తర గోగ్రహణ కథకు సినిమా పేరు —, 23. ఇప్పుడు యువకులను బాగా ఆకర్షిస్తున్న కొత్తరకం మల్లవిద్య.

నిలువు: 1. శ్రీకృష్ణదేవరాయల కొలువు కూటము, 2. పోరుపెట్టని, 3. ఆద్యంతాలులేని సప్తస్వరాలు, 4. '—నంతలోనె తత్తర మది ఏల కృష్ణా!' 5. ఉత్తర రామాయణాన్ని

(3 వ పేజీ తరువాయి)

మెచ్చుకోడం మొదలుపెట్టి నీ మీద ప్రేమతో అతడు తలమునకలై ఉన్న సమయం చూసి, అప్పుడు విడాకు లియ్యి! అతని మనస్సును తీవ్రంగా గాయపరచా లంటే ఇదొక్కటే మందు!" తటపటాయిస్తూనే ఆమె అందుకు ఒప్పుకుంది.

ఆరు నెలల తర్వాత ఆ మనశ్శాస్త్రవేత్త తిరిగి ఆమెను కలుసుకున్నప్పుడు "ఎలా ఉంది పరిస్థితి?" అని అడిగాడు, "మీ సలహా చాలా బాగా పని చేసింది డాక్టర్‌గారూ!" అంది ఆమె. "అయితే ఇదే మంచి సమయం. వెంటనే విడాకులకు నోటీస్ ఇయ్యి!" అన్నాడు డాక్టర్.

"మా ఆయన అంటే నాకు ప్రాణం! అమ్మో—ఆయనను వదలి నేను ఉండగలనా?" అని కళ్ళ నీళ్ళు పెట్టుకుంది ఆ ఇల్లాలు.

"కాలు జారితే తీసుకోవచ్చు; నోరు జారితే తీసుకోలేము."

వీరి కథగా కూడా చెప్పవచ్చు, 13. 'ఒకడు' కి వ్యావహారిక రూపాంతరం; 14. సన్నని కడ్డీ, 17. సంహరించేవాడు; 20. నవారు లేకపోతే మంచానికి అల్లేది, 21. 'నటియే'- 2/3 సైజుకు కుదించండి:

## తెలివికి పరీక్ష

1. 437 (410) 642: 541 ( ) 783 తగిన సంఖ్యతో బ్రాకెట్‌ను పూరించండి, 2. ఆ....,....పు' ఒకే రెండక్షరాల మాటతో రెండు పదాలనూ అర్థవంతంగా చేయండి, 3. బ్రహ్మచారి పెళ్ళి అయాక ఏమవుతాడు? 4. గింజ బయటికి కనిపిస్తూ ఉండే పండు ఏది? 5. అరచేతులు చల్లగా ఉండేవారికి ప్రేమ ఎక్కువ__నిజమా? అబద్ధమా? 6. మంటల మధ్య, చిక్కుకున్నప్పుడు మిక్కిలి సాయపడేది ఏది? 7. 'ఇడుములు కనబోకు' —దీనిలో సరివర్ణాలలో ఒక భారత పాత్రను గుర్తించండి, 8. ఉనికి పట్టు, ఆ చేయి - ఈ రెండర్థాలనూ బోధించే ఒకే మాట చెప్పండి.

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి:

1. అగత్యము: (ఏ) కళ్ళులేనిది, (బి) అగస్త్యుడు వ్రాసిన గ్రంథం, (సి) అవసరము, (డి) అనవసరము.

2. అగాథము: (ఏ) గాథ లేనిది, (బి) మిక్కిలి లోతైనది, (సి) గడతో కూల్ప రానిది, (డి) అతి గంభీరము.

3. అగ్గలము: (ఏ) అధికము, (బి) ఆ గొంతు, (సి) అగ్నితో కూడినది, (డి) కోలాహలము.

4. అగ్రజ: (ఏ) పార్వతి. (బి) ముందు పోవునది, (సి) జ్యేష్ఠ సోదరి, (డి) అక్క.

5. అచలం: (ఏ) ఆకాశం, (బి) భూమి, (సి) పర్వతం, (డి) 'చలం' లేకి.

6. అచ్యుతుడు: (ఏ) అగ్రవర్ణ

## పాఠకుల అభిప్రాయాలు

(మే 1984)

★

"ఉన్నాయి చట్టాలు
కలిమి కవి చుట్టాలు!"
—పి. రామయ్య, అరణ్యం కండ్రిగ, చిత్తూరు జిల్లా.

* * *

"అందని పూలకు ఆకర్షణ ఎక్కువ
అవి అందుకోవాలని మనసుకి మక్కువ!"
—వి. శ్రీనివాస్. జన్నారం ఆదిలాబాద్ జిల్లా.

* * *

"పేదవాడి గోడు
వినేవాడు లేడు!"
—బి. మహేష్, కోట బొమ్మాళి శ్రీకాకుళం జిల్లా.

"యోగాభ్యాసానికి ధ్యేయం - శారీరక ఆకర్షణ,
బలం కావు; నైతిక శోభనూ, ధార్ఢ్యాన్నీ సాధించడం!" -గీత

వ్యక్తి, (బి) విష్ణువు, (సి) అధమవర్ణం వ్యక్తి, (డి) కృష్ణుడు.

7. అచ్చరలు: (ఏ) అక్షరాలు, (బి) గూఢచారులు, (సి) దేవ వేశ్యలు, (డి) అప్సర స్త్రీలు.

8. అజస్రము: (ఏ) ఆదిశేషుడు, (బి) నిత్యము, (సి) విరివి లేనిది, (డి) మేకనుండి వచ్చినది.

## విస్డమ్
### పోటీల కూపను
### జూలై 1984

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు ఖరీదు చేసే పుస్తకం బహుమతి।

## మీరైతే.....?

"రెండవ భారతీయ వ్యోమగామి అయ్యే ఛాన్స్ వస్తే?" మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి

## భావపరిచయ పోటీ



8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

## ఏటేటా ఉత్పత్తి అయ్యే చెత్త

ఇండియాలో ఏటా 20 కోట్ల టన్నుల "చెత్త" (waste) ఉత్పత్తి అవుతూంది. ఈ చెత్తను ఏం చేయాలో నిర్ణయించి అమలు జరిపే ఒక జాతీయ స్థాయి సంస్థ ఏదీ ఇంత వరకూ రూపొందలేదు.

"ముసలితనం వచ్చినా తీవ్రత ఏ మాత్రం తగ్గనివి: ధనాశ, ప్రాణభీతి!"

# పోటీల (ఫలితాలు)

(మే 1984)

వ్యాసం - మొదటి బహుమతి: వి.పి. నరసింహారెడ్డి, గుంటూరు; రెండవ బహుమతి: ఎస్. సుధారాణి, గుంటూరు; మూడవ బహుమతి: పి. ఆదిలక్ష్మి, గుంటూరు.

క్విజ్ - జవాబులు: 1. బుధుడు (మెర్క్యూరీ), 2. చైనా భాష, 3. విదుషి, 4. జనవరి 15న, 5. స్విట్జర్లండ్, 6. శూద్రకుడు, 7. ఆర్కిమెడీస్, 8. 'స్టేట్ మంత్రి' అంటారు

విజేతలు-మొదటి బహుమతి: మేడిశెట్టి శివగణేశ్ బాబు, వరంగల్; రెండవబహుమతి: ఎమ్. సునీత్ కుమార్, చిలకలూరిపేట; మూడవ బహుమతి: ఎన్.వి.ఆర్. రమణ, హైద్రాబాద్.

పజిల్-జవాబులు-అడ్డం: 1. విజయవాడ, 4. రక్తాక్షి, 6. లవణము, 7. సలిలము, 8. గరికపూలు, 10. తిరుమల, 12. వసుంధర, 14. వేడుకలు, 16. కనిరేని, 19, విరాగులు, 20 డు,ము,వు లు.

నిలువు: 1. విలాసవతి, 2. వాలముగల, 3. డవ. 4. రములపూ, 5. క్షిపణులు, 9. కలువలరేడు, 11. రుద్రుడు, 13. రవళులు, 14. వేసవి, 15. లుకలు, 18. నిము.

విజేతలు - మొదటి బహుమతి: పి. జయశ్రీ, ఒంగోలు; రెండవ బహుమతి: ఎస్. మధుసూదన రావు, వసుంధర, (శ్రీకాకుళం జిల్లా); మూడవ బహుమతి: వెన్నా నర్సిరెడ్డి, చినకొదమ గుండ్ల, గుంటూరు జిల్లా.

తెలివికి పరీక్ష — జవాబులు: 1. అక్కినేని (సినీ నటులలో రాజకీయాలలో దిగనివాడు అక్కినేని ఒక్కడే), 2. 'కై', 3. ఈశాన్యమూలకు, 4. దుర్యోధనుడు, 5. బారిష్టరు పార్వతీశం (ఇది నవల, తక్కినవి నాటకాలు), 6. దోమ, 7. మనుష్యులందరూ

## తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లలో కుష్ఠురోగుల ఆధిక్యం

'యునైటెడ్ నేషన్స్ ఇంటర్నేషనల్ చిల్డ్రన్స్ ఎమర్జన్సీ ఫండ్' (UNICEF) వారు ఇటీవల ప్రకటించిన లెక్కల ప్రకారం ఇండియాలోని 32 లక్షల మంది కుష్ఠురోగులలో దాదాపు 30 శాతం అంగవైకల్యంతో బాధ పడుతున్నారు. 4 లక్షల మంది సాంఘికంగానూ, ఆర్థికంగానూ వెనుకబడిన వారు. 2 లక్షల మంది భిక్షుకులు. ఇండియాలోని మొత్తం కుష్ఠురోగులలో సుమారు 50 శాతం తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలోనే ఉన్నారు.

"మిక్కిలి ఎత్తైన స్థానం మీద గురిచూడు:
మధ్యలో ఏదో స్థానాన్ని నువు అందుకుంటావు!" —గ్రీక్ సామెత

మంచివారు కారు(సి), 8. అబద్ధం (సంసారం సుఖంగా సాగడానికి సంఘంతో సంబంధం అవసరం).

విజేతలు - రెండవ బహుమతి: సి. పద్మలత, మోగల్లు; మూడవ బహుమతి: సిద్దు వీరభద్రాచారి, గోవిందపురం, గుంటూరు జిల్లా.

మాటల మహిమ - జవాబులు: 1. ప్రేగు (ఏ), 2. నుయ్యి (సి), 3. పాండురాజు తల్లి (బి), కాశీరాజు కూతురు (డి), 4. పద్మము (సి), ఎర్రగన్నేరు (డి), 5. సముద్రము (సి), 6. కిరణము (సి), కాంతి (డి), 7. పాపము (సి), దుఃఖము (డి), 8. పేలాలు (బి), అక్షింతలు (డి).

విజేతలు - మొదటి బహుమతి: ఎమ్. సరస్వతి, కర్నూలు; రెండవ బహుమతి: యన్. కుమారదేవరెడ్డి, పూతలపట్టు (చిత్తూరు జిల్లా); మూడవ బహుమతి: డి. రమేష్, హైద్రాబాద్.

ముఖచిత్ర వ్యాఖ్య - మొదటి బహుమతి: ఇ. పద్మావతి, విజయనగరం; రెండవ బహుమతి: డబ్ల్యు. పండితరాయలు, కోనూరు (విజయనగరం జిల్లా); మూడవ బహుమతి: బి. ఎస్. శ్రీనివాసరావు, నల్గొండ జిల్లా.

పాఠకుల అభిప్రాయాలు - మొదటి బహుమతి: పి రామయ్య, అరణ్యం కండ్రిగ (చిత్తూరుజిల్లా); రెండవ బహుమతి: వి. శ్రీనివాస్, జన్నారం (అదిలాబాద్ జిల్లా); మూడవ బహుమతి: బి. మహేష్, కోటబొమ్మాళి (శ్రీకాకుళం జిల్లా).

మీరైతే? - మొదటి బహుమతి: శ్రీమతి జమునా సుధాకర్, ఆవడి, మద్రాసు; రెండవ బహుమతి: డా. దాకోజు సూర్యప్రకాష్, నగరికటకం (శ్రీకాకుళం జిల్లా); మూడవ బహుమతి: వి. వరకుమార్, హైద్రాబాదు.

భావ పరిచయపోటీ - మొదటి బహుమతి: అద్దేపల్లి భరత్‌కుమార్, బాపట్ల; రెండవ బహుమతి: కె. పాండురంగ ప్రసాద్, ఒంగోలు; మూడవ బహుమతి: ఎస్. మధుసూదనరావు,వసుంధర (శ్రీకాకుళంజిల్లా).

---

(6 వ పేజీ తరువాయి)

వచ్చారు. ఆయన భార్య మధూ శర్మ 'గృహాలంకరణ' డిజైన్‌లలో నిపుణురాలు. 8 ఏళ్ళ కుమారుడు 'కపిల్' ఒక్కడే వారికి సంతానం. శ్రీ శర్మ హాబీలలో గ్రంథ వ్యాసంగం, సంగీతం, క్రికెట్, స్క్వాష్, టెన్నిస్ ఆటలూ ముఖ్యమైనవి.

ఒక భారతీయుణ్ణి అంతరిక్షంలోకి పంపడంలో విజయం సాధించడంతో ప్రపంచంలో అలా అంతరిక్షంలోకి వ్యోమగాములను పంపిన 14 వ దేశం అయింది ఇండియా. తక్కిన 13 దేశాలు: అమెరికా, రష్యా, బల్గేరియా, హంగరీ, వియెత్నాం, క్యూబా, జెకోస్లొవేకియా, పోలండ్, తూర్పు పశ్చిమ జర్మనీలు, రుమేనియా, మంగోలియా, ప్రాన్స్.

ప్రపంచంలో అంతరిక్షయానం చేసిన వ్యోమగాములలో శ్రీ శర్మ 138 వ వారు, రష్యన్ వ్యోమగాములతో కలిసి అంతరిక్ష యాత్రచేసిన 11 వ విదేశీయుడు ఆయన.

"శత్రువును గౌరవంగా చూడడం అర్హత లేని సదుపాయాన్ని అతనికి సమకూర్చడమే." —జాన్సన్

తెలుగు మాస పత్రికకు

అన్ని గ్రామాలలోనూ, పట్టణాలలోనూ

సమర్ధవంతులైన ఏజంట్లుకావాలి !

ఏజన్సీ వివరాలకు

వెంటనే రాయండి.

సర్క్యులేషన్ మానేజర్

9, దేశికా రోడ్డు,

మైలాపూరు,

మద్రాసు-600 004

EDITED AND PUBLISHED BY K V GOVINDA RAO.
AT No. 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004. (INDIA).
PRINTED BY Mr. D. SRIDHARA RAO, AT KRANTI PRESS,
!, FRANCIS JOSEPH STREET, MADRAS - 600 001. (INDIA).
*COVER PRINTED BY SRI SHENBAGAM LITHO PRESS SIVAKASI.*